## తప్పక చూడండి

ఈస్టిండియా ఫిలిం కంపెనీ (P) లిమిటెడ్ సమర్పించు
యం. జి. ఆర్. పిక్చర్స్ వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం

# కొండవీటి సింహం



మాటలు. మహారథి. పాటలు. ఆరుద్ర.
సంగీతం కె.వి. మహాదేవన్. పామర్తి. ఛాయ. రామమూర్తి.
ఎడిటింగ్. ఎన్.ఎస్ ప్రకాశం. నారాయణ

దర్శకత్వం **కె. శంకర్.**

ఈస్టిండియా రిలీజ్

MOULI

స్థలాభావంవల్ల ఈ వారం 'ప్రశ్నావళి' వెయ్యలేకపోతున్నాము. —సం॥

* * *

8—11—69 నుండి పుంగనూరు ఆంధ్ర వైశ్య యువజన సంఘంవారు చిత్రలేఖన పోటీ ప్రదర్శన జరుపుతున్నట్లు రాస్తున్నారు. వివరాలకి పై సంఘం కార్యదర్శికి రాయవచ్చు. (సం.)

* * *

శ్రీకాకుళం యువభారతి సంస్థ మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా కవితాసంకలనం ఒకటి వెలువరించడానికి, సంక్రాంతి కథల పోటీ నిర్వహించడానికి నిశ్చయించారు. వివరాలకి కార్యదర్శి యువభారతి, శ్రీకాకుళంకి రాసి పొందవచ్చు. (సం.)



# ఉత్తరాలు

## మతిమరుపు

కేంద్ర మంత్రివర్గం సభ్యులూ, అంతరాత్మవాదీ అయిన బాబూ జగజీవనరామ్‌గారు గత పది సంవత్సరాలుగా ఆదాయంపన్ను వివరాలు దాఖలు చెయ్యకపోవటానికి కారణం 'మతిమరుపే' నన్నారు, ప్రధానమంత్రీ, అంతరాత్మవాదానికి సృష్టికర్తలూ అయిన శ్రీమతి గాంధిగారు.

ఈ మతిమరుపు విలువ ఎంత అయి ఉంటుందా అని నేను ఆలోచిస్తూ ఉండగా ఒక పత్రికలో శ్రీ జగజీవనరామ్‌గారి జీతం వివరాలు వేశారు. వారి జీతం రు. 2250 లు ఇదికాక వేరే భత్యాలు ఉన్నాయట. మొత్తంమీద వారు 10 సంవత్సరాలుగా మరిచిపోయిన పన్ను మొత్తం కనీసం రు. 50 000 ఉంటుందిట. (దానిమీద 6 శాతం వడ్డీవేస్తే, చట్టప్రకారం 170 శాతం శిక్షవేస్తే, బాకీపడిన మొత్తం రు. 140,000 కి తగ్గదుట!)

ఆమధ్య ఎవరో సినిమావారిని ప్రభుత్వంవారు శిక్షించారు. మరి ఈ గాంధేయుడయిన అంతరాత్మవాది విషయంలో ఏమిచేస్తారు? భారతరత్న బిరుదు ఇస్తారా?

కె. వి. రామకృష్ణ, (కొట్టూరు.)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 10—10—'69

శ్రీ సౌమ్యనామ సం॥ భాద్రపద మా. బ. చతుర్థి

సంపుటము: 62 సంచిక: 5

స్థాపితము: 1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: శ్రీ టి. వెంకట్రావ్

వెనుక అట్టమీద బొమ్మ: 'గీతోపదేశం'
చిత్రకారుడు: గెనిశెట్టి

# విప్లవం అంటే పన్నీటి జల్లు కాదు!

'ప్రభూ ఇది తిరుగుబాటు కాదు. ఇదొక పెద్ద విప్లవం' అని లూయీ 16 కి 'బాస్టిల్' పడిన రోజున (జూలై 14, 1789) ఒకరు చెప్పారుట.

ఈ నినాదాలు 'విప్లవం వర్ధిల్లాలి!' అనే నినాదాలు భగత్‌సింగ్, దత్‌లు పలుకగా విన్నాడు. వారి ద్వారా కేంద్ర శాసనసభలో బాంబులు వేశారు. నేడు ఇటువంటి నినాదాలని కమ్యూనిస్టులు పల్లిస్తున్నారు. శ్రీ నెహ్రూ తమ ఉపన్యాసాలు ముగియగనే 'జై హింద్' అనేవారు. కమ్యూనిస్టులు, 'విప్లవం వర్ధిల్లాలి' అంటూ ఉంటారు.

పోయిన వారం బాబూ జగజీవనరామ్ (ఆహార శాఖామంత్రి) అన్నారు, 'తిరుగుబాటు విప్లవం కావచ్చు' అని. ఇక ప్రధానమంత్రి కూడా 'విప్లవం' గురించి మాట్లాడారు. లేనివారికి సాయం చెయ్యక పోతే విప్లవం తప్పదేమో అన్నారు.

మేడమ్ గాంధీ బాబూ జగజీవనరామ్‌లకి విప్లవం అంటే ఏమిటో తెలుసా? ఒక్క పేరు మిగిలినది విప్లవం.

## సంస్కరణ-సవరణ-మార్పు

1946 నుంచి నేటి దాకా నెహ్రూ కుటుంబం వారు ఏదో విధంగా ఈ దేశాన్ని పాలిస్తునే ఉన్నారు. బెంగుళూరులో ఈ ఏడాది జరిగిన పార్లమెంటరీ బోర్డు సమావేశం దాకా జవహర్‌లాల్ నెహ్రూగారు ఏమీ చెయ్యలేదా, ఆతరువాత వారి కుమార్తె మేడమ్ గాంధి ఏమీ చెయ్యలేదా? 'సంస్కరణ అంటే దురాచారానికి సవరణ' అని ఒకరన్నారు. విప్లవం అంటే అధికారంలో మార్పు. మేడమ్ గాంధి, బాబూ జగజీవనరామ్‌లు పూర్తి అధికారం—మార్పుని ఎదురు చూస్తున్నారా? ఎవరి నుంచి ఎవరికి? లేనివారు ఈ మార్పుకి సిద్ధంగా ఉన్నారా? విప్లవాలు తమాషాగా మొదలయ్యేవా, పన్నీటి జల్లు వంటివా? అభిప్రాయం వెనుక తుపాకి ఉంటే అదే విప్లవం, అన్నాడుట నెపోలియన్ ఒకసారి. మేడమ్ గాంధిగారి అభిప్రాయాల వెనుక తుపాకి కట్టుబండే ఉండవచ్చు. అయితే అది ఎటువంటి విప్లవం? నిర్వహణ సరిగ్గా ఉండనప్పుడు హఠాత్తుగా జరిగే మార్పుని విప్లవం అంటారు. అంటే, మేడమ్ గాంధి, బాబూ జగజీవనరామ్‌ల విప్లవం ప్రభుత్వ నిర్వహణలో లోపాల వల్ల వచ్చిందా? వస్తే ఇంత దాకా జరిగిన చెడు నిర్వహణకి కారకులు ఎవరు?

## కుంటుతూ వెనక్కి

మానవ చరిత్ర పరిశీలిస్తే ఒక సత్యం స్పష్టంగా తెలుస్తుంది. అప్పుడప్పుడూ ఒక విప్లవం వస్తుంది. తర్వాత అందరూ సంసార పక్షమనిపించే నెమ్మది జీవితానికీ, నిలకడకీ, పనికీ తిరిగి వెళ్లిపోతారు—కుంటు కుంటూ. కర్మ సిద్ధాంతాన్ని నమ్మే హైందవుడు విప్లవాన్ని బలపరుస్తాడా?

మహమ్మద్ ఘోరీ, మరొక 2000 మంది విలాసంగా ఢిల్లీ మీదకి దండెత్తారు. పృథ్వీ రాజుని యుద్ధంలో చంపారు. మహమ్మద్ ఘోరీ సింహాసనం ఎక్కి ఎందరినో తన మతంలోకి మార్చుకున్నాడు. అయినా దేశంలో హైందవుల సంఖ్య అధికం. వారు తలుచుకుంటే ఘోరీ పని పట్టించి ఉండవచ్చు. అలాగ చేశారా?

## ఆకలి-రసగుల్లాలు

1940 ప్రాంతాలలో బెంగాలులో 15 లక్షల మంది తిండిలేక మరణించారు. వారి సోదరులు వారి శవాల మీదుగా నడిచి వెళ్లి రసగుల్లాలు ఆరగించారు. సుమారు రెండేళ్ల క్రితం బీహారులో క్షామం వచ్చింది. రాజస్తాన్‌లో పోయిన సంవత్సరం పెద్ద కరువు వచ్చింది. ఒక్క పెద్ద అల్లరి జరిగిందా? కర్మ సిద్ధాంతాన్ని అనుసరించి హైందవుడు తన బీదరికాన్ని భరిస్తాడు. మహమ్మదీయుడేమో 'కిస్మత్'ని నమ్ముతాడు.



అమెరికా కొత్త రాయబారి కెన్నెత్ బి. కీటింగ్.

కమ్యూనిస్టులు విప్లవాన్ని ఎలా పోషిస్తారు? వర్గ యుద్ధం మొదలుపెట్టారు. ఈ రకం యుద్ధానికి అనువయిన ప్రచారాన్నే మేడమ్ గాంధిగారు రాష్ట్రపతి ఎన్నిక అయినప్పటి నుంచీ చేస్తున్నారు. కమ్యూనిస్టులకి మతం అక్కరపడదు. దేవుడు, మతం మీద యుద్ధం వర్గ యుద్ధం కన్నా, ముఖ్యమయినది వారికి.

గుజరాత్‌లో అల్లరులు మతానికి సంబంధించినవి. మేడమ్ గాంధి లౌకికమయిన వర్గ యుద్ధం కోసం ప్రచారం చేస్తే బాబూ జగజీవనరామ్‌గారు బంజరు భూములని ఆక్రమించమని భూమి లేని వారికి బోధిస్తున్నారు. గుజరాత్‌లో యుద్ధం బీద—గొప్పవారి మధ్యనా? కాదు; విభిన్న మతస్థుల మధ్య. ఢిల్లీలో జనసంఘంవారు మరొక మత కలహానికి కావలసిన ప్రచారాలు చేస్తున్నారు. గోవధ నిషేధం దేశం అంతటా ఉండాలంటున్నారు.

## మతం - సోషలిజమ్

తాము నిజంగా పేదరికాన్ని రూపు మాపాలనుకుంటే మేడమ్ గాంధిగారు దేశంలోని మతసంస్థలన్నిటి మీదా— హైందవ దేవస్థానాలు కానివ్వండి, మహమ్మదీయ వక్ఫ్‌లు కానివ్వండి—దాడి చెయ్యాలి. సోషలిజమ్ మతానికి చాలా దూరం. ప్రజల మత్తుమందు మతం అని లెనిన్ అనలే అన్నాడు.

బాంకుల జాతీయం, విదేశీ వ్యాపారం జాతీయం, ప్రభుత్వరంగం విస్తరణ—ఇవన్నీ అజ్ఞానాన్నీ, పేదరికాన్నీ నాశనం చేస్తాయా? పోనీ విప్లవం ఈ పని చెయ్యగలదా? ప్రజలలో విజ్ఞానం పెరగాలి కాని వర్గ యుద్ధం ఏ సమస్యనీ పరిష్కరించలేదు. జపాన్ భూస్వామ్య సంస్థ కలిగినది. శ్రమ ద్వారా ప్రపంచంలో కెల్లా సంపన్నమయిన దేశాలలో ఒకటిగా మారింది.

## జ్ఞానోదయం

పత్రికలలో ఏవేవో వార్తలు కనిపిస్తాయి. మంత్రి వర్గాలలో మౌలికమయిన మార్పులు రావాలిట. సరే, ఈ జ్ఞానం హఠాత్తుగా డాక్టర్ జకీర్ హుస్సైయిన్ మరణం వల్లనే కలిగిన జ్ఞానమా? బెంగుళూరులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సమావేశం ముందు భారతదేశంలో బీదవారేరా? ఉత్తరప్రదేశంలో శ్రీ సి. బి. గుప్తాని తప్ప శ్రీ

కమలాపతి త్రిపాఠీని వేస్తే బీదలు ధనవంతులు అయిపోతారా? (ఈ మార్పు కోసం మేడమ్ గాంధి గారు ప్రయత్నిస్తున్నారు.) ప్రధానమంత్రి మిత్రులలో ఒకరయిన శ్రీ జ్యోతిబసు గారు ఏర్పాటు చేసే ఘెరావ్, సమ్మెల వల్ల పేదరికం పోతుందా?

అసలు మేడమ్ గాంధిగారికి దారిద్ర్యం గురించి ఏంత తెలుసు? ఆకలి బాధతో ఆమెకి పరిచయం ఉన్నదా? సకల సంపన్నమయిన కుటుంబంలో పుట్టి పెరిగిన వారికి పేదల తరపున మాట్లాడే హక్కు లేదు.

**బాబూ సేవ, త్యాగం?**

పోనీ బాబూ జగజీవనరామ్ గారయినా తమ కులంలోని బీదలకి ఎంత చేశారు? తమ ఆదాయంలో ఎంత భాగం పేద హరిజనులకి ఇచ్చారు?

ఇక విదేశాలలో విలాసయాత్రలు శ్రీ దినేశ్ సింగ్ ఎప్పుడయినా న్యూఢిల్లీలో నాలుగు రోజుల పాటు ఉంటారా? అంతకిముందు హనోయ్ వెళ్లారు, తర్వాత మాస్కో, ఇప్పుడు మళ్లీ న్యూయార్క్... వారితో పోటీ పడేవారు కాశ్మీరు మాజీ మహరాజా డా. కరన్‌సింగ్. దేశంలోకి ఎక్కువ యాత్రీకులు రావటానికి బదులు వారే ఒక పెద్ద యాత్రీకుడుగా మారిపోయినట్లు తోస్తుంది. శ్రీ బి. ఆర్. భగత్ ఏదో పని మీద అమెరికా వెడుతున్నారు. వారి ఖర్చులు భరించేది ఎవరు? భారతదేశంలోని బీదవారే కదా! ఎందరిని ఇంత కొంతమంది మభ్యపెట్ట గలుగుతున్నారు!!

* * *

శ్రీ మంకేకర్ టయిమ్స్ ఆఫ్ ఇండియా పత్రికకి స్థానిక సంపాదకులు. ఆయన పి. టి. ఐ.లో మొదలు పెట్టి ఆతర్వాత టయిమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లలో పని చేశారు. కొంతకాలం నిరుద్యోగులుగా ఉన్నప్పుడు శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి జీవితచరిత్ర, 1962 దోషులు మొదలయిన పుస్తకాలు రాశారు. తిరిగి టయిమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో చేరి పత్రికా ప్రపంచంలో తమ స్థానానికి మంచి ప్రాముఖ్యత కలిగేట్లు చేసుకుంటున్నారు.

భారతదేశంలోని పత్రికల లోపాలని పరిశీలించే సమావేశాలు జరిపారు. పోయిన వారం ప్రెస్ క్లబ్ (దానికి పేరు అధ్యక్షులు) భోజనానికి ప్రధానమంత్రిని ఆహ్వానించారు. దుర్గాపూర్‌లో, మంకేకర్‌లా మాత్రమే ఉంటే పత్రికల గతి ఏమి కావాలి?, అదృష్టవశాత్తు మనకింకా ఫ్రాంక్ మొరేస్, ముల్గాంవ్‌కర్‌ల వంటి సంపాదకులు ఉన్నారు. 'స్టేట్స్‌మెన్' వంటి పత్రికలు ఉన్నాయి. ఇటు వంటి సంపాదకులు, ఇటువంటి పత్రికలూ తమ జీవనం కన్నా భారతదేశం భవిష్యత్తు ముఖ్యమయినదని గుర్తించారు, గుర్తించాలి.

# సినిమాల్లో మతప్రచారం

## ముగ్గురు మూర్ఖులు

మహేష్ *






చూడామణి ముందుగా వచ్చాడు. ఏటి ఒడ్డున కూర్చుని యేదో ఆలోచిస్తున్నాడు.

తరువాత కొంచెం సేపటికి, చిదంబరం, చంచలావు వచ్చారు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు ?' అని చంచలావు చూడామణిని ప్రశ్నించాడు.

'వాడు మంచివాడు కాదు. వాని జోలికి వెళ్లవద్దు' అని చాలామంది అంటుంటారు. అంటే వాడు మంచివాడైతే వాని జోలికి వెళ్లమనేకదా దానికి అర్థం. ఎదుటివాడు తిరగబడేవాడైతే వాని జోలికి యెవరూ వెళ్లరు. కాని యెదుటి వ్యక్తి మంచివాడైతే వానిమీద పెత్తనం చలాయించడానికో, అవమానించడానికో అందరూ ప్రయత్నిస్తుంటారు. హిందూమతం నేడు పొందుతున్న అవమానాలే దానికి తార్కాణం' అన్నాడు చూడామణి.

'ఏం? యిప్పుడు యేమయింది?'

'సంఘర్ష' అనే హిందీ సినిమాలో ఒక సన్నివేశం ఉంది. అందులో ఒక వేషంలో బాల్‌రాజ్ సహానీ [illegible] యొక్క హత్యను గురించి పిల్లలకు చెబుతాడు. ఆ హత్యకు ప్రతీకారం చేయడానికి అతను ప్రతిజ్ఞ చేస్తాడు. 'బనారస్‌లో ఒక పెద్ద రాక్షసుడు ఉన్నాడు' అని అతను ఆ సందర్భంలో పిల్లలకు చెబుతాడు. 'ఆ రాక్షసుడు హిందువుడా ?' అని పిల్లలు ప్రశ్నించుతారు. (హిందూ ఓం మేహీ ఐసే బడే బడే రాక్షస్ హోతే హై') హిందువుల్లోనే అటువంటి పెద్ద పెద్ద రాక్షసులు ఉంటారు' అని బాల్‌రాజ్ సహానీ సమాధానం చెబుతాడు' అని అంటూ చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఇతర మతస్థులందరూ మంచివాళ్లు. హిందువుల్లోనే యిటువంటి దుర్మార్గులు ఉంటారనే కదా దీనికి అర్థం. ఇది హిందూమతాన్ని అవమానించడం కాదా?'

'సంఘర్ష' చిత్రంలో ఉన్న ఈ సంభాషణను ఫిల్మ్ సెన్సారుబోర్డు యెలాగ ఆమోదించింది ?

'మహాత్మాగాంధిని హిందువుడే హత్య చేశాడు కాబట్టి హిందువులను ఈవిధంగా దూషించవచ్చునని సెన్సారుబోర్డుగాని మరొకరుగాని భావించినట్లయితే వారు ఈ క్రింద ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి ఉంటుంది'

'లింకన్, కెన్నెడీ, మార్టిన్ లూథర్ కింగ్ వీరిని క్రైస్తవులే హత్య చేశారు. అందుచేత సినిమాల్లో ఈ హత్యల ప్రసక్తి తీసికొనివచ్చి 'క్రైస్తవుల్లోనే యిటువంటి దుర్మార్గులు ఉంటారు' అని అంటే సెన్సారుబోర్డు అంగీకరిస్తుందా?'

'అలాగే లియాకత్ అలీఖాన్ హత్యను ఉద్దేశించి 'మహమ్మదీయుల్లోనే యిటువంటి దుర్మార్గులు ఉంటారు' అని అంటే సెన్సారుబోర్డు ఆమోదిస్తుందా?

'ఎవరికిగాని అవమానాన్ని కలిగించే విషయం డెఫమేషన్ యేదీ ఫిల్ములో ఉండకూడదు' అని సినిమాటోగ్రాఫ్ చట్టంలో స్పష్టంగా ఉంది. సెన్సారు బోర్డువారు ఫిల్మును సెన్సారు చేసేటప్పుడు ఈ విషయాన్ని పరిశీలించవలసి ఉంది. అయినా 'సంఘర్ష' చిత్రంలో ఈ సంభాషణను ఆమోదించడంలో సెన్సారు

'అవమానకరమైన విషయం యేదీ ఫిల్ములలో ఉండకూడదు' అనే శాసనం హిందువులకు వర్తించదా ? శాసనాలలో ఉన్న రక్షణలను ఉపయోగించుకొనే హక్కు హిందువులకు లేదా? హిందువులను అవమానించేసే హక్కు ఈ దేశంలో ప్రతి ఒక్కరికీ ఉందా? ప్రతివారిచేత అవమానింపబడడం హిందువుల పవిత్ర కర్తవ్యమా?' అని చూడామణి ప్రశ్నించాడు.

'ఏదో ఒక చిత్రంలో ఉన్న విషయాన్ని గురించి ఇంతగా ఆలోచించడం ఎందుకు? బహుశా సెన్సారుబోర్డువారు ఆ సంభాషణను సరిగ్గా విని ఉండకపోవచ్చును. అందుచేత ఆ సంభాషణను వారు వదిలివేసి ఉంటారు. అయినా యిప్పుడు ఆ విషయాన్ని సెన్సారుబోర్డువారి దృష్టికి తీసికొని రావచ్చును కదా!' అన్నాడు చిదంబరం.

'ఈ ఒక్క చిత్రం గురించే నేను అనడం లేదు. ఈ మధ్యను వస్తున్న చిత్రాల ధోరణే అలాగ ఉన్నది' అంటూ చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'ఇదివరకు 'బీదలపాట్లు' అనే ఫిల్ము వచ్చింది. ఒక ఫ్రెంచి నవలను ఆధారంగా తీసుకొని ఆ చిత్రాన్ని తీశారు. క్రైస్తవ మతస్థుడైన ఒక దొంగను క్రైస్తవ మత గురువు సంస్కరిస్తాడు. ఆ దేశంలో అందరూ క్రైస్తవ మతస్థులే కాబట్టి ఆ కథలో మత భేదం అనే ప్రసక్తి లేదు.'

ఆ కథను తెలుగు చిత్రంగా తీసినప్పుడు కథలో కొన్ని మార్పులను చేశారు. ఫ్రెంచి దేశంలో జరిగిన అల్లర్లకుగాను భారత స్వాతంత్రోద్యమాన్ని చూపించారు. క్రైస్తవుడైన దొంగను హిందువుగా మార్చారు. కాని మతగురువును మాత్రం క్రైస్తవునిగానే వదలివేశారు. అంటే హిందువుడైన దొంగను క్రైస్తవ మత గురువు సంస్కరించినట్లుగా చూపించారు. ఇది హిందూ మతాన్ని అవమానించడం కాదా? క్రైస్తవ మతగురువుకు బదులు ఒక హిందూ సన్యాసిని ప్రవేశపెడితే వచ్చిన నష్టం యేమిటి? క్రైస్తవుడైన దొంగను క్రైస్తవ మతగురువు సంస్కరించగలిగినప్పుడు, హిందువుడైన దొంగను హిందూమత స్వామి సంస్కరించలేడా?

'ఇంతే కాదు. హిందూమతం కంటే

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# ముగ్గురు మహార్షులు

యితర మతాలు మంచివి అనే అభిప్రాయాన్ని ప్రేక్షకుల్లో కలిగించడానికి కొన్నిచిత్రాల్లో ప్రయత్నాలుజరుగుతున్నాయి.

'ప్రతి చిత్రంలోను కొన్ని సన్మార్గుల పాత్రలు కొన్ని దుర్మార్గుల పాత్రలు ఉంటాయికదా! వాటిలో దుర్మార్గుల పాత్రలు అన్నీ సాధారణంగా హిందువులనే అయి ఉంటాయి. కాని సన్మార్గుల పాత్రల్లో కనీసం ఒకటి క్రైస్తవుని గానో మహమ్మదీయునిగానో చూపిస్తుంటారు. ఏ పాత్ర యే మతానికి చెందినా, కథకు రాబోయే నష్టం ఏమీ ఉండదు.'

'ఉదాహరణకు హిందువులైన రౌడీలు తరుముకొని వస్తున్న ఆసామిని యే మహమ్మదీయుడో రక్షించినట్లుగా చూపిస్తారు. అలాగే అనాధుడైన హిందూ రోగిని క్రైస్తవుడైన డాక్టరు రక్షించినట్లుగా చూపిస్తారు. ఈ సన్నివేశాల్లో అందరూ హిందువులే అయినట్లుగా చూపించినా రాబోయే యిబ్బంది యేమీ ఉండదు. ఇటువంటి ఫిల్ములను చూసిన తరువాత 'హిందువుల్లో మంచివాళ్లూ ఉంటారు, చెడ్డవాళ్లూ ఉంటారు కాని యితర మతస్థులందరూ మంచివాళ్లే' అని అభిప్రాయం ప్రేక్షకులకు కలగవచ్చును కదా! ఇది హిందూమతానికి అవమానం కాదా?

'కొన్ని చిత్రాల్లో క్రైస్తవ మతాధిక్యతను మరోక విధంగా చూపిస్తుంటారు. ఒక హిందూ పాత్రధారి నిస్సహాయమైన పరిస్థితిలో చిక్కుకొన్నప్పుడు యేసుక్రీస్తు బొమ్మనో, శిలువనో చూపిస్తుంటారు. నిస్సహాయులందరికీ యేసుక్రీస్తు ఒక్కడే రక్షకుడనే అభిప్రాయాన్ని ఆ దృశ్యం ప్రేక్షకులకు కలిగిస్తుంది. నిస్సహాయుడు అయిన వ్యక్తి హిందువు అయినప్పుడు ఈశ్వరుడో, విష్ణువో లేకపోతే మరో దేవుడో రక్షకుడు కాకూడదా? ఏసుక్రీస్తుకు తప్ప హిందూ దేవతలకు నిస్సహాయులను రక్షించే శక్తి లేదా? హిందూ సమాజాన్ని చిత్రించే ఫిల్ముల్లో యేసుక్రీస్తును చూపించడం హిందూమతానికి అవమానం కాదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. కాని హిందూమత ప్రచారం మాత్రం ఫిల్ముల్లో జరగడం లేదా? పౌరాణిక చిత్రాలన్నింటి ల్లోను హిందూదేవతలను పొగడడం లేదా? దీనికి యేమిటి అంటావు?' అని తిరిగి ప్రశ్నించాడు చంద్రరావు.

'అవును పౌరాణిక చిత్రాల్లో హిందూ దేవతలను పొగడుతున్నారు. అది హిందూ మత ప్రచారమే. ప్రస్తుతం వస్తున్న పౌరాణిక చిత్రాలు హిందూమత గౌరవాన్ని వృద్ధి చేసేటంతటి స్థాయిలో లేవనుకో. అది—వేరే విషయం' అంటూ చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

హిందూ పౌరాణిక చిత్రాల్లో హిందూ దేవతలను పొగడినట్లుగా, క్రైస్తవుల గాథలను చూపించే చిత్రాల్లో క్రీస్తును పొగడవచ్చును. దానికి యెవరి అభ్యంతరమూ ఉండదు.

హిందువులు తమ దేవతలను పూజించినట్లుగా చిత్రాల్లో చూపిస్తున్నారు. అలాగే క్రైస్తవులు క్రీస్తును ప్రార్థించినట్లుగా క్రైస్తవసమాజాన్ని చిత్రించే ఫిల్ముల్లో చూపించవచ్చును. దానిని చూసి హిందువులుకూడా ఆనందిస్తారు.'

'అంతేకాని హిందూసమాజాన్ని చిత్రించే ఫిల్ముల్లో క్రీస్తును, క్రైస్తవులను ప్రవేశపెట్టి హిందూమతాన్ని అవమానించవద్దు' అని నేను కోరుతున్నాను' అన్నాడు చూడామణి.

'నువ్వు చెప్పేది వాస్తవానికి విరుద్ధంగా ఉంది.'

'ఏం?'

'మనదేశంలో కోట్లాది మహమ్మదీయులు లక్షలాది క్రైస్తవులు ఉన్నారు. మనం యెక్కడకు వెళ్లినా వీరు కన్పిస్తూనే ఉంటారు. మహమ్మదీయులు, క్రైస్తవులు కూడా మనదేశపు జీవితంలో అంతర్భాగం. చలనచిత్రాలు వాస్తవానికి దగ్గరగా ఉండాలని యిప్పుడు అందరూ కోరుతున్నారు, అందుచేత మహమ్మదీయులను క్రైస్తవులను చలనచిత్రాల్లో చూపించకపోవడం వాస్తవానికి విరుద్ధం కాదా?' అని తిరిగి ప్రశ్నించాడు చిదంబరం.

'మహమ్మదీయులను క్రైస్తవులను అసలు ఫిల్ముల్లో చూపించకూడదు. అని

(52వ పేజీ చూడండి)

# సౌందర్యము మరియు తాజాదనపు భావన...సింథాల్ సబ్బుతో

మీ కోసము...అపూర్వమైన సౌందర్యము, రోజంతా తాజాదనము... రెండు విధములుగా పనిచేసే సింథాల్ సబ్బుతో.
సింథాల్ లో ప్రపంచములో కెల్ల ఎంతో బాగుగా పనిచేసే క్రిమినాశిని జి-11 (హెక్సాక్లోరోఫిన్) ఉంది.

జి-11 గల సింథాల్ మాత్రమే మిమ్మల్ని అందముగా తాజాగా ఉంచగలదు.




## సింథాల్ నిజంగా దుర్గంధ నివారిణి సబ్బు

# మనం: మన సంస్థలు

"ప్రవాసి"

[రచయిత 1959లో రాసిన 'నేను ఆంధ్రుణ్ని' వ్యాసం ఈ పత్రికలోనే వచ్చింది. దాని మూలంగా ఆంధ్రులలో కొంత సంచలనం కలిగింది—అని రచయిత అంటున్నారు...... —సం.]

తెలుగుభాష మరుక్కున్న తగిలే సామెతలకు ప్రసిద్ధి. ఆ సామెతల్లో ఎంతో అర్థం ఉంది. కొన్ని చాలా నాటివి ఉంటాయి. వాటి నాటితనం వల్ల వ్యాపయంలో గుచ్చుకుంటాయి కూడా. ఉదాహరణకి 'తెడ్డెక్కడి కెళ్ళినా వీగానే' ఈ రోజుల్లో స్త్రీలు చెప్పుల్తో వచ్చాక తెడ్డు వాడక ఏ పల్లెటూళ్ళలోనో ఉంది. అయినా దాని విలువ మాత్రం వీగానే దాకుండా పావలా అయింది...మిగతా ధరలతో పాటు! పూర్వపురోజుల్లో ధరల్లో విశేషం మార్పు లేనప్పుడు....తెడ్డు ఖరీదు ఎక్కడికి వెళ్ళినా వీగానేయే ఉండేది. దాని విలువలో మార్పు ఉండేది కాదు. ఈ సామెత వ్యంగ్యార్థం....మానవులకు అన్వయిస్తూ ఉపయోగంలోకి వచ్చింది. ఒక మనిషి ఒకే రీతిగా అన్నివేళలా.... అన్ని సందర్భాల్లోనూ వ్యవహరిస్తే... ద్దాని మూలంగా ఆ మనిషి ప్రవర్తనలోనూ... విలువల్లోని మార్పు రానప్పుడు 'తెడ్డెక్కడి కెళ్ళినా వీగానే' అంటాం.

పై సామెత మనుష్యులకు వర్తించినప్పుడు ఆ మనుష్యుల సమూహమైన సంస్థలకు సమాజముకు కూడ వర్తిస్తుంది.

సర్వసాధారణంగా ఒక ఆంధ్రునికి సోదరాంధ్రునితో పడదు. వారి విభిన్న దృక్పథాల మూలంగా [illegible] తం విడిచిపెట్టి ఉద్యోగరీత్యా అన్యప్రాంతాలకు వలసపోయిన ఆంధ్రుడైనా ఐకమత్యం ఉందాంటే అదీ లేదు. ఈ సందర్భంలో పై సామెత ప్రవాసాంధ్రులకు వర్తిస్తుంది. తెలుగువారు— ఆంధ్రదేశంలోని తెలుగువారు— అన్ని రంగాల్లోనూ వివిధంగా వైషమ్యాలు పెంచుకొని, కత్తులు నూరి ద్వేషభావంతో నిండుకొని ఒకరిని చూస్తే రెండవవానికి కిట్టక.... పగతో.... కక్ష తీర్చుకుందికి అవకాశం వెదుకుతూ... అవకాశం దొరికినప్పుడు ప్రత్యర్థిపై విషాలు కక్కుతూ.... మింగేద్దామా అన్నట్టు ఉరకడం చూస్తూనే ఉన్నాం. దీనికి కారణం ఏమో.... తీరుబాటుగా కూచుని ఆలోచిస్తే ఒక్కటే తోస్తోంది. ఆంధ్రులకు ఉద్రేకం ఎక్కువ.... ఉత్సాహం ఎక్కువ... ముందు చూపు మాత్రం తక్కువ. పెద్ద ఆశయాలతో సంస్థలు స్థాపిస్తారు. కాని ఆశయాలను ఆచరణలోనికి తేవడంలోనే వచ్చింది ప్రమాదం. ఒకరు 'అవు'నంటే అది సంఘం శ్రేయస్సు కొరకైనా సరే... 'కాదు'అనేవారు పదిమంది. సంఘం శ్రేయస్సు కోసం ఒక పని చెయ్యాలి అంటే వెంటనే వస్తుంది జవాబు అది అనవసరం అని. దాని మూలంగా.... మీటింగుల్లో ప్రారంభించినప్పటి వాతావరణం ముగించినప్పుడు ఉండదు. క్రమంగా... గొంతుకలు పై శ్రుతిలోకి పోతాయి. ఎన్నో సందర్భాల్లో ముష్టి యుద్ధాలతో అంతమవుతాయి. దీనికి మన స్వభావం కారణం. 'తాను పట్టిన కుందేలికి మూడే కాళ్ళు' అని ప్రతి ఆంధ్రుడూ వాదిస్తాడు. కాదన్న వాడు గాడిద అంటాడు. ఆ మాటతో ఉద్రేకంతో రక్తం పొంగుతుంది. ముష్టి యుద్ధాలకి దారి తీస్తుంది.




విశాలమైన దృక్పథంతో ఏకీభవించడం— అది దేశ సౌభాగ్యానికి... సంఘ శ్రేయస్సుకి ఎంతో అవసరం— శ్రేయస్కరం.



### బిట్‌క్విజ్ నెం. 56 — 18 క్లూలు

1. గాంధీజీ ముఖ్యంగా కర్మయోగి/దయామయుడు.

2. గాంధీజీ తనకు అతి ప్రియం / అలంకృతం కాని ఏ వస్తువునూ అంటలేదు.

3. గాంధి తన లేఖనములను అస్పష్టంగావంలో ఎంతమాత్రమూ ఉంచి యుండక పోయినప్పటికీ ఆయన వ్యక్తిత్వమును స్పష్ట / వర్గీకృత పరచుట మరియు ఆయన ఆలోచనను వర్గీకరణ మేర్పుట నిజంగా ఒక సమస్యయే.

4. తన అన్ని భంగముల / అనుసారకుల అందరి పూర్ణ బాధ్యతను గాంధీజీయే వహించెనని యుద్ధ మునకు ఇతిహాసం సాక్షియై వున్నది.

5. ఇటీవలి ఇతిహాసమందలి గొప్ప వ్యక్తులందరిలో మహాత్మా గాంధి అందరికంటె ఎక్కువ ఉదార / భద్రమైన మరియు పరిత్యాగి, యోగి మరియు జన సేవక సమన్వయ వ్యక్తి.

6. గాంధీజీయొక్క మనస్సు / వినోదం పూర్తిగా మాయా లక్షణ రహితమైన బాలుని నిష్కళంక ఆధిక్యతను గలిగి యుండెను.

7. నిజంగా మహాత్ముని అనేక మనోహర విశేషతలలో ఆయన వినమ్రత / వినోద పూర్వక బోధ ఒకటియై వుండెను.

8. ఆయన బద్ధకంకణుడై నేటి నిమిత్తం నిలచాడో ఆయా ఆదర్శము / భావనలను స్వీకరించకుండా అనేకమంది గాంధీజీ యొక్క రాజనీతిక నాయకత్వమును అంగీకరించారు.

9. మహాత్మా గాంధిని రష్యాలో ఇప్పుడు ప్రతిక్రియావాదిగా గణింపబడుట లేదు, కాని మానవజాతికి గొప్ప నాయకుడు / ముక్తి దాతలలో నొకడుగా పరిగణింప బడ్డాడు.

10. గాంధి వినీతుడు, వినమ్రుడు, సమాధాన ప్రియుడై యుండెను, కాని వ్యక్తియొక్క నైతిక/రాజనీతిక హక్కుపై ముట్టడిని సహింపజాలక పోయేవాడు.

11. నిస్సందేహంగా, గాంధి క్షుద్బాధా పీడిత జనుల బాధలను తొలగించే రామబాణ ఔషధం/ ఉత్సాహం గలిగి యుండెను.

12. మహాత్మాగాంధి స్వాతంత్ర్య సమర నాయకత్వమును వహించినప్పుడు ఏమి సంభవించింది? పార్టీ/దర్శన, నీతి, తంత్రం మరియు కార్యక్రమత పూర్తిగా మారినవి.

13. శాంతి / పూర్ణత అనేకమందికి ఇంకా ఇప్పటి ఆదర్శవాదియొక్క స్వప్నంగా కనిపిస్తున్నది. మహాత్మా గాంధికి ఆ స్వప్నమే యథార్థవాది యొక్క ఆవశ్యకతగా మారిపోయింది.

14. గాంధియొక్క దర్శనం అస్తిత్వంయొక్క ఉద్ధతా / ఏకతాయొక్క ఆధారంపై ఆధారపడియున్నది.

15. గాంధీజీ శోధకుడు/సిద్ధుడు అయివుండెను.

16. గాంధి కేవలం అహింసా సత్యాగ్రహానికి స్మారక చిహ్నం ఇంకేమాత్రం కాదు, ఆయన ఒక నూతన దృష్టి / పద్ధతికి సంబంధించిన క్రాంతికారక ప్రేరణ యుండెను

17. గాంధి మానవ శక్తి / [illegible] సాకారరూపమై యున్నాడు.

18. గాంధి తన ప్రత్యర్థికి [illegible] [illegible] అవకాశాన్ని [illegible].

## No. 56: 18 CLUES

(1) Gandhiji was primarily a man of Action / Compassion.

(2) Gandhiji touched nothing which he did not Adore / Adorn.

(3) Though Gandhiji was the last person to make any of his writings ambiguous, it is indeed a problem to Clarify / Classify his personality and categorise his thought.

(4) History bears witness to the fact that Gandhiji took the entire responsibility for all his Failures / Followers.

(5) Of all the great figures in recent history, Mahatma Gandhi may reasonably be supposed to have been the most Generous Gentle and self-denying, a perfect blending of the saint and the public servant.

(6) Gandhiji's Heart / Humour had the untainted exuberance of a child, completely devoid of any snobbish trait.

(7) Indeed, among the many fascinating qualities of the Mahatma was his inimitable sense of Humility / Humour.

(8) Many accepted Gandhi's political leadership without at the same time accepting the Ideals / Ideas and values for which he s ood.

(9) Mahatma Gandhi is no longer regarded in the USSR as a reactionary, but as one of the great Leaders / Liberators of mankind.

(10) Gandhi was meek, humble and compromising but he could not tolerate any attack on the Moral / Political right of man.

(11) Undoubtedly, Gandhi had the Panacea / Passion for amel'orating the sufferings of the starving masses.

(12) What happend when Mahatma Gandhi took over the leadership of the freedom struggle? There was a complete overhauling of Party /Philosophy, policy, technique and programme.

(13) Peace / Perfection to many may still appear to be the dream of an idealist. To Mahatma Gandhi it is this dream translated into the necessity of the realist.

(14) The philosophy of Gandhi is based on the concept of the Sanctity /Unity of existence.

(15) Gandhi was a Seeker / Seer.

(16) Gandhi is no longer a symbol of mere passive resistance, he is a dynamic and revolutionary urge for a new Vision / Way of life.

(17) Gandhi is human Will / Wisdom personified.

(18) Gandhi always offered every possible opportunity to his adversary to Win / Withdraw.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకోబడినవి. అవి పూర్తి వాక్యములు కావచ్చు లేదా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు ఆన్సర్ లిస్ట్‌తో పాటు బిట్‌క్విజ్ లో ప్రచురించబడును. [illegible]

## మనం–మనసంస్థలతా

కబళిస్తాయి.

ప్రవాసాంధ్రులలో ఐకమత్యం వాంఛనీయమని అనిపించినా సంఘ సభ్యులు... ఎప్పుడు ద్వేషభావంతో... ప్రవర్తిస్తారో... కూకటి వేళ్ళతో సంస్థలు కూలబడతాయి.

దేశ కళ్యాణానికి సంఘ శ్రేయస్సుకి పునాది సహనంతో కూడుకున్న త్యాగం— ఔదార్యం... ఒకరిని అర్థం చేసుకోడం... ఏకీభవించనప్పుడు ఒప్పించడం... అంతేకాని... అభిప్రాయాలు భేదించినప్పుడు ముష్టియుద్ధాలకి దిగితే మన విజ్ఞానం ఏమైనట్టు?

ప్రవాసంలో నున్న పదిమంది ఆంధ్రులు కలియగానే వెంటనే ఒక 'సమితి' స్థాపిస్తారు. అది మామూలే. కొద్ది నెలలలోనే ప్రవాసాంధ్రుల సంఖ్య హెచ్చుతుంది... 'సమితి'కి అవతి దూరంలోనే ఒక 'క్లబ్బు' లేదా వేరొక 'సమాజం' వెలకొల్పబడుతుంది. కొన్ని కేవలం నాటక సమాజాలు. వాటి ఆశయం నాటకాలలో అభిరుచియున్న ఆంధ్రులను పోగుచేసి అవకాశ మున్నప్పుడల్లా ఒక్కొక్క నాటకం స్టేజి చెయ్యడమే. ఇంతవరకూ బాగానే ఉంది. కాని వెనువెంటనే.. కుక్కగొడుగుల్లా పది నాటక సమాజాలు ఉత్పన్నమవుతాయి. వారిలో వారికి వైమనస్యాలు... పోటీలు... బహిరంగంగా దూషణలు! ఇది ప్రవాసాంధ్రుల ప్రత్యేకత.

ఆంధ్రేతరులు యిదంతా తిలకించి నవ్వేరనుకోండి. 'నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు' అని ధీమాగా.... సగర్వంగా.... ఛాతీ ముందుకి విరిచి నడిచిపోతాడు ప్రవాసాంధ్రుడు. ●

---

### అవీ–ఇవీ...

హైదరాబాదులోని కళాకారులు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడెమీని పునర్ నిర్మించవలసిందిగా ముఖ్యమంత్రికి ఒక మెమొరాండంని సమర్పించారు. పూర్వ కార్యవర్గం పదవీకాలం 1969 ఫిబ్రవరి, 20 తో ముగిసింది. అప్పట్నుంచి ఎకాడెమి ఏలాంటి కార్యక్రమాలని నిర్వహించలేదు. కవున్సిల్‌లో 50 శాతం సభ్యులని ప్రభుత్వం సూచించలేదు. మిగతా 50 శాతం సభ్యుల్ని 1969 జనవరిలోనే వివిధ సంస్థలనించి ఎన్నుకోవడం జరిగింది.

కళాకారులలో శ్రీయుక్తులు వి. ఆర్. కృష్ణ, నటరాజ రామకృష్ణ, సి. నారాయణరెడ్డి, భాగవతుల రామకోటయ్య, కె. ఎల్. నరసింహారావు, పి. ఎస్. ఆర్. అప్పారావు, వి కృష్ణంరాజు, పోతుకూచి సాంబశివరావు, కె. కామేశ్వరరావు, ప్రఖ్య శ్రీరామమూర్తి, పి. గోవిందు చౌదరీలు ఉన్నారు. (ఎ. వి.) ●

# ఒక వారం విపరీతం

ఇంగ్లండుకు చెందిన గోల్డ్‌వోరి అనేచోట 78 రోజులు సజీవసమాధిలో వున్న బిల్ కేరవ్స్ అనే యువకుడు బయటకు వచ్చాడట. 78 రోజుల క్రితం ఒక ఆరడుగుల పెట్టెలో, భూమికి ఆరడుగుల లోతున యితను తనని తను సమాధి చేయించుకుని 79వ రోజున బయటకి వచ్చి ప్రపంచ రికార్డును స్థాపించాడట. 'కానీ ఏం లాభం, నా ఖర్మ, నేనూ, నా పిల్లలు, నా దరిద్రం మళ్ళీ తయారు. ఈ పనికి నాకు 400 స్టెర్లింగులు ఖర్చయ్యాయి. దీనిని ఒక వ్యాపారంగాచేసి, బయటకివచ్చి ఒక షాపుపెట్టుకుందామనుకున్నాను. నాపెట్టు నాశనం అయ్యింది. వ్వ.... నాట్యూరూ'అని ముఖం వేలాడేశాడట. అంతా ఆశ్చర్యపోయేవారేగాని చేయూత (అతను కోరిన విధానంలో) నిచ్చేవారు లేరట. పూర్ వరల్డ్!!

* * *

తూర్పుగోదావరిజిల్లాలో వేసెక్టమీ (కుటుంబ నియంత్రణ పథకం) ఆపరేషను చేయించుకున్నవారిలో నలుగురు ధనుర్వాతంతో పది రోజుల్లో చనిపోయారట. ధనుర్వాతం యీ ఆపరేషనువల్ల వచ్చిందని చెప్పలేమని, అసలా ప్రాంతంలో ధనుర్వాతం కొంచెం హెచ్చుగానే వుందని ఆరోగ్యశాఖ (అది తర సంబంధశాఖల) మంత్రిగారు అన్నారట.

* * *

# రోజుకి రు. 3,000 లు ఆదాయం !

కలకత్తాలో ఒక మహాపీయుణ్ణి దట్టం పట్టుకుంది. ఈయన ఆదాయం రోజుకు మూడు వేలట. ఈ రాబడి నిస్తున్న ఆయన వ్యాపారం కలకత్తాలో కేవలం వేశ్యా గృహాలు నడపడమేనట. అనకున్న రెండు పెద్ద యిళ్ళు గాక, మరో పదకొండు యిళ్ళని అద్దెకు తీసుకున్నాడట. అన్నిరాష్ట్రాలకు, అన్నిజాతులకు, భాషలకు చెందిన ఆడవారున్నారట ఈయన వేశ్యగృహాలలో. ఆడవారిని దేశంలో అన్ని ప్రాంతాల నుండి తెచ్చి పెట్టడానికి ఆయనకు బోలెడు మంది పనిచేస్తున్నారట. (పుంజాలా మరి) వేశ్యాగృహాల మీద డబ్బు సంపాదించే వారిలో యీయన సంపాదించే అంత సంపాదించేవారు మరి లేరని ప్రభుత్వం నిర్ధారించింది. ఈయన్ని అరెస్టు చేయడంతో కలకత్తాలో యీమధ్య




పెద్దమనుష్యులు, ప్రభుత్వోద్యోగులు తర వెనుక నిలబడేవారు. ఈయన వ్యాపారం సాగించడానికి పదకొండు మంది న్యాయవాదులు (?) తోడ్పడేవారట. ఇంతకీ యీయన ఆదాయపు పన్ను సరిగా కట్టలేదని ఆ శాఖ తీసిన ఆరాలలో యీ విషయాలు బయటపడ్డాయట. అనకూడదు గానీ ఇన్‌కమ్ టాక్స్ శాఖ గొప్పది మాస్టారూ !

* * *

ఢిల్లీ నుంచి కాన్పూరు వస్తున్న బస్సొకటి బిన్దకి అనే చోట ఆగిందట. అక్కడ జనం విపరీతంగా ఎక్కారట. బస్సు ఓవరు లోడు అయ్యిందని, జనాన్ని దింపితే గాని తను బండి నడపడం కుదరదని, డ్రయివరన్నాడట. ఈలోగా యు.పి.కి చెందిన ఎమ్మెల్యేగారొకాయన ఆ బస్సులోనే, కాన్పూరు వెళ్ళితీరాలని తీర్మానించుకున్నారట. డ్రయివరు బాగా లేదనేసరికి కోపావేశంతో ఆ ఎమ్మెల్యేగారు బస్సు డ్రయివచేసి కొట్టారట— ఇది నిర్భయం.

* * *

(50వ పేజీ చూడండి)

# వారఫలం

## 10-10-1969 శుక్రవారం మొదలు 16-10-1969 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో పోటీదారులతో పోటీ పెరుగుతుంది. ఎవరితోను వాదప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.

**వృషభం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. పోటీదారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఇతరుల మీద ఆధరపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు.

స్త్రీలకు:— పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:** వృత్తి వ్యాపారల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. ప్రయాణం ద్వార కార్యసాధన చేయగలరు. వారం ఆఖరులో యితరుల నిమిత్తం శ్రమ పొందగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. శుభకార్యాలు నెరవేరుతాయి.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. పోటీదారిలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వస్తుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు కలుగుతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మకరం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారంలో యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కుంభం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఆందోళన కలుగుతుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి ఫలిస్తుంది. [illegible] వలసిన వ్యవహారాలు [illegible] నెరవేరుతాయి.

స్త్రీలకు:— అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం.** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

—సుహాష్

# ఒకే ట్యూబుతో ఐదు రకాల ఫినిష్‌లు!

- వివిధోపయుక్తమైనది—ఒక ట్యూబును వివిధ అప్కొలైట్ రేంజ్ పెయింట్లతో వాడవచ్చును. వెంటనే మీకు వచ్చిన ఫినిషులు — అద్దము వంటి మెరుగు, మందమైన మెరుగు, మేట్ (తళతళలాడని) మెరుగు, హేమర్, మెటాలిక్ వంటి ఫినిష్‌లు — వస్తాయి.
- వీటికి అప్కొలైట్ రేంజ్ పెయింట్లను ఎంచుకోండి: సింథటిక్ ఎనామిల్, అక్రిలిక్ ఎమల్షన్, డెకోప్లాస్ట్ వాల్ ఫినిష్, సింథటిక్ మేట్, హేమర్ మరియు మెటాలిక్ మరియు అక్రిలిక్ వాషెబుల్ డిస్టెంపర్.
- కావలసిన రంగు తక్షణమే తెచ్చేది మేజిక్‌టచ్.

## మేజిక్‌టచ్

కావలసిన రంగును తక్షణమే తెచ్చేది




ఎక్కడ రంగు కావలెనో
అక్కడ
ఏషియన్ పెయింట్స్



**ఏషియన్ పెయింట్స్**



# డబ్బు గబ్బు

పాలప్రగు వెంకటేశ్వరరావు

దేముడు మనిషిని పుట్టించాడు.

మనిషి డబ్బును పుట్టించాడు.

ఆ డబ్బు మనిషిని ముకుదాడు వేసి ఆటలాడిస్తుంది. మనిషి ఆ మాయలో పడి తనని తానూ, తనని పుట్టించిన ఆ దేముణ్ణి కూడా మోసం చేసుకుంటాడు, మోసం చేసాననుకుని మురిసిపోతాడు. ఏడుస్తాడు కూడా ఒక్కో సమయంలో. అదొక పిచ్చి.

ఆ సాయంత్రం సమితి ఆఫీసులో నా పని ముగించుకునేసరికి నాలుగ్గంటలైంది. తలనొప్పి వచ్చినట్లనిపించింది. కాస్త కాఫీ తాగి ఇంటిమొగం పట్టాలనుకొని, సైకిల్ను నడిపించుకుంటూ మెయిన్‌రోడ్డు వెంట నడుస్తున్నాను. అంత క్రితం కొద్దిగా వానపడింది. రోడ్డంతా బురదనీటి గుంటలతో నిండివుంది. జాగ్రత్తగా నడుస్తున్నాను. ఇంతలో అనుకోకుండా నా వెనకవించి దూసుకు వచ్చిన ఓ కారు విపరీతమయిన వేగంతో నన్ను దాటిపోయింది. నేను తేరుకునేలోగానే నా బట్టలు, సైకిలు బురదనీటికి తడిశాయి.

స్టీరింగు చక్రం తిప్పుతూ, సిగరెట్టు కాలుస్తున్న ఆ మనిషి నన్ను చూడలేదు గాని నేను అతన్ని గుర్తుపట్టాను. ఆతను వెళ్ళిపోయాడు గాని అతను నడుపుతున్న కారు నామీద చిమ్మిన బురదనీరు యింకా

అరలేదు.

అవును. అతను 'సూర్నారాయణగారి కొడుకు'

ఆ పరిస్థితికి ఎవర్ని అనీ ఏం లాభం లేదు. ఆ బురద నీటిని తుడిచివేసుకోవటం తప్ప నాలాటి సగటు మనిషి చెయ్యగలిగిందేమీ లేదు.

మొహం తుడుచుకుంటూ మరో నాలుగడుగులు వేశాను.

దూరాన కోమలవిలాస్ రేడియో సంగీతంతో ఆహ్వానిస్తున్నది.

'పంతులూ! ఓ పంతులూ!' నా వెనకాల్నించి కేక వినిపించింది. ఆ గొంతు పరిచిత మనిపించి వెనక్కి తిరిగి చూశాను. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఒక మనిషి నన్ను సమీపిస్తున్నాడు.

ఆ మనిషి ఎవరు? నేను వెంటనే గుర్తు పట్టలేకపోయాను.

బాగా పెరిగిన గడ్డం, లోతుకుపోయిన కళ్ళు, గుంటలు పడిన చెంపలు, సన్నగా అస్థిపంజరం లాగున్నాడు. ఎవరబ్బా?

ఆ మనిషి నన్ను సమీపించాడు.

'పంతులూ! కులాసాగా వున్నావా? ఏంటి సంగతులు? ఎక్కడ వుంటను?' మొదలైన ప్రశ్నలతో ఆయన నన్నుక్కిరి బిక్కిరి చేశాడు.

అవును. ఆయన సూర్నారాయణే!

సూర్నారాయణగారు బాగా మారిపోయేరు. మనిషి స్వరూపమే గుర్తుపట్టలేనట్లయింది. మాసిన బట్టలు చిరుగుల్ని దాచుకోలేక పోతున్నాయి. మనిషిలో ఇదివరకటి అహం ఆవంతయినా కనబట్టం లేదు. ఆ స్థానంలో దీనత్వం చోటు చేసుకుంది. అహంకారం చోట ఆప్యాయత వెల్లివిరుస్తోంది.

నే నాశ్చర్యం నుంచి తేరుకునేలోగానే ఆయన మళ్ళీ మాట్లాడేరు.

'పంతులూ! ఓ పది పైసలుందా? టీ ఇప్పిస్తావా?' అన్నాడు.

'రండి' అని నేను నడిచేను. ఆయన నన్ననుసరించాడు.

* * *

సూర్నారాయణగార్ని నేను పది సంవత్సరాల క్రితమే ఎరుగుదును. అప్పుడు వాళ్ళబ్బాయి పదో క్లాసు చదువుతూండేవాడు. ఆ రోజుల్లోనే నేను కొన్ని ఇంటి బాధలకు గురికావలసి వచ్చింది. అప్పుడు నాకు సహాయం చేసి ఆదుకుంది సూర్నారాయణగారు. గోళ్ళూడగొట్టి ఆ తర్వాత అపరిమితమయిన వడ్డీతో వసూలు చేశారనుకోండి. అది వేరే సంగతి. అసలుకంటె వడ్డీ ముద్దుగదా!

ఆ రోజుల్లో ఒకనాడు సాయంత్రం... ఆయన నన్ను యింటికి పిలిపించారు.

అంత క్రితం రోజే నేను వడ్డీతోసహా ఆయన బాకీ తీర్చివేయటం జరిగింది. నేను వెళ్ళేసరికి సూర్నారాయణగారు పాత కేలండర్లు ఎదురుగా పెట్టుకుని కూర్చున్నారు. నన్ను తీవ్రంగా మాట్లాడారు. మొహం ముడుచుకున్నారు. సకరించారు.

'ఏమయ్యా! నమ్మినందుకు ఇలాగేనా నట్టేటో ముంచటం?' అని సూటిగా అడిగేరు.

అసలు విషయమేమిటో నాకు అర్థం కాలేదు. ఆ పాత కేలెండర్ల వెనక గజిబిజిలా ఎన్నో పద్దులు అంకెలు వున్నాయి. అవన్నీ ఆయనదగ్గర ఋణం పుచ్చుకున్న జనానికి సంబంధించిన పద్దులు. అసళ్ళూ—వడ్డీలు వెరశి ఇవ్వవలసిన మొత్తాలు. అంతక్రితం అనేకసార్లు నన్ను ఆయన పిలిపించారు. రోజూ సాయంత్రాలు నన్ను కూర్చోబెట్టి వడ్డీ లెక్కలు కట్టించుకునేవాడు. అవి తను కట్టిన లెక్కలతో సరిపోతే తృప్తిగా శ్వాస పీల్చేవాడు ఆతర్వాత సర్దాగా కబుర్లు చెప్పి ఇక వెళ్ళి రమ్మనేవాడు. ఆరీత్యా ఆయనదగ్గర నాకు చనువు ఏర్పడింది. ఆ చనువుతోనే ఆయన నాకు అప్పిచ్చి ఆదుకోవటం జరిగింది.

అయితే ఇప్పుడీ వుపద్రవమెందుకో నా కర్థం కాలేదు.

ఇంతలో రమణయ్య వచ్చాడు. అప్పుడు అసలు సంగతి వెళ్ళగక్కారు ఆయన.

'ఏమయ్యా! పెద్దమనిషీ! ఇన్నాళ్ళనుంచి నీపైన నీ లెక్కంపైన నాకు నమ్మకం వుండి. నీసొంత బాకీగదాని తప్పు లెక్క వేసి మోసం చేద్దామనుకున్నావా?' అన్నారు సూర్నారాయణగారు.

నాకు ఆశ్చర్యం, కోపం వచ్చాయి. అయినా లోలోపలే అణగద్రొక్కుకున్నాను. పేదవాడికోపం పెదవికి చేటుగదా! సూర్నారాయణగారు అసలే అనుమానం మనిషి. డబ్బు విషయంలో అసలే నిక్కచ్చిగా వుంటారు. డబ్బుకోసం మరి దేన్నీ లెక్క చెయ్యరు.

సూర్నారాయణగారు అన్నదమ్ములతో వాటాలు పంచుకుని విడిపోయినప్పుడు ఎంత రాద్ధాంతం చేశారో ఇప్పటికీ ఊళ్ళో వాళ్ళు చెప్పుకుంటూ వుంటారు.

పెళ్ళిలో ఇస్తానన్న కట్నంలో ఇంకా కొంత డబ్బు బాకీవున్నాడని మామని జుట్టుపట్టుకుని ఈడ్చి పెంటపోగులో పాతిపెట్టబోయాడోసారి, ఆయన.

అత్త తరువు ఆస్తిగురించి ఒకసారి షడ్డకుడితో తలబడి బుర్రబద్దలు కొట్టుకున్నంత పని చేశాడొకప్పుడు.

అన్నదమ్ములతో మాటల్లేవు. స్నేహితం లేదు. పార్టీ లేదు, పరువూ లేదు. ఆదర్శం లేదు. అనుభవం లేదు.

ఉన్నదల్లా ఒకటే.

డబ్బు. డబ్బు—వడ్డీలు—అసలు ఫాయిదాలు. ఇనప్పెట్టె నిండటం. అప్పిచ్చి అన్యాయంగా పెద్ద పెద్ద వడ్డీలు వేసి అవతలి వాళ్ళని పీల్చి పిప్పి చెయ్యటం. అవతలి వాళ్ళని నాలుగిళ్ళు కూల్చి తన ఇంటికి మరోగది చేర్చటం.

రోజులో ఇరవయినాలుగ్గంటలూ లెక్కలు వేసుకుంటూ, అందులోని బ్రహ్మానందాన్ని తనివిదీరా అనుభవించటం, అప్పులివ్వటం కోర్టులకి తిరగటం, కొంపలు కూల్చటం, కాసికి మరో కాసి జతచెయ్యటం — ఇదే సూర్నారాయణగారి వ్యాపృతి. నేను చూస్తూ వుండగానే పంచుకున్న నాలుగెకరాలూ, పదిహేనెకరాలవటం పాతికవేల రొక్కం కాస్తా లక్షని దాటిపోవటం జరిగింది. ఇంకా రహస్యంగా దాచిపెట్టింది ఎంతో వుందని వుకారు.

సూర్నారాయణగారి భార్యామణి ఆయనకి తగిన ఇల్లాలే. తవ్వెడు బియ్యాన్ని రెండు పూటలకి సరిపెట్టమని ఆయనంటే, మూడుపూటలకి ఎలా సరిపెట్టాలా అని యోచిస్తుందామె. లేక లేక కలిగిన పుత్రరత్నం మాత్రం తలిదండ్రులతో ఆ రోజుల్లోనే దద్దాయాగం చేసి ఇంటిని ఒక కొలిక్కి తెచ్చేవాడు.

డబ్బునుగురించిన సూర్నారాయణగారి అభిప్రాయాలు ఆ రోజుల్లో పూర్తిగా సమర్థనీయమేనని నేను ఒప్పుకున్నాను. కాని దాని నీడలో మిగతావన్నీ మరుగున పడిపోవటం ఎంతవరకు సమంజసమన్న ప్రశ్న మాత్రం

# డబ్బు గబ్బు

మిగిలిపోయింది.

సూర్నారాయణగారు తరుచూ కోర్టుల చుట్టూ తిరుగుతూ వుండేవారు ఆకోర్టులు పట్నంలో వుండేవి. ఎంతలేదన్నా కనీసం పది మైళ్ళదూరం వుండేది. ఆ పదిమైళ్ళూ రోజూ కాళ్ళనడకన వెళ్ళి వచ్చేవారాయన. కాళ్ళరిగిపోయినా, పాదాలు చిల్లులు పడినా బొబ్బలెక్కి అసలు వాచినా అలాగే వెళ్తునా వుండేవారు. వస్తూ వుండేవారు. చెమటలు గ్రక్కే మండువేసవిలో కూడా ఆయన అణా కర్చుపెట్టి సోడా తాగటం చూసిన వాళ్ళు లేరు నేను ఎప్పుడయినా పనిమీద పట్నం వెళ్ళినప్పుడు అప్పు డప్పుడూ నాకు ఆయన తటస్తపడే వారు. ఆ సమయంలో 'పంతులూ! నాదగ్గిర చిల్లర డబ్బుల్లేవు. సోడా తాగిస్తావా?' [illegible] డిన సందర్భాలూ వున్నాయి. మొహమాటం చేత గనిండి, [illegible] డబ్బును చూసి గనిండి, లేక [illegible] గనిండి, [illegible]కి నేను కాఫీ పోయించిన సంద [illegible] జేబులూ, [illegible] సరుకులూ. మా [illegible] చిన్నట్లూ జ్ఞాపకం [illegible] మొహం వేసిన సన్ని వేశాలూ వున్నాయి

[illegible] డబ్బులు వున్నాయని చిల్లర [illegible] ర్చులువేసి తగలెయ్యమని ఎవరూ [illegible], డబ్బులు మూలుగుతున్నాయని [illegible] తిరగమనీ అనలేరు. అవసరం [illegible] వాళ్ళందరికీ వూరికే వడ్డీ [illegible] అప్పులు పెట్టమనీ అంటానికి [illegible] దేయినా రూల్సూ, [illegible], వుండాలిగా!

కాని సార్! డబ్బులుగారూ!

ఇదేం అన్యాయమండీ?

[illegible] పోతుంటే అణా పెట్టి సోడా [illegible]కి జేబులోనే వున్న కాగితం [illegible] వేరనా? కాళ్ళు బొబ్బలు [illegible], కీళ్ళు సడలిపోతుంటే, నడవ [illegible] ఓపిక చచ్చి పోతుంటే ఓ [illegible] పారేసి సైకిలు కొనుక్కో [illegible]? అసలు లేకపోతే ఎవరూ అడగ రనుకో.

మనిషికి 'నువ్వు' ముఖ్యంగాదని ఎవరూ అనరు, ఈరోజుల్లో నువ్వే అన్నీ. నువ్వంటేనే విలువలు లేకపోతే మరెన్ని వున్నా పరిగణన లేదు. అనువ్వార్ - ఒప్పు

కుంటాము.

కాని ప్రాణంకంటె, నిన్ను పుట్టించిన మనిషికంటె, ఆ మనిషియొక్క కనీసపు అవసరాలకంటే కూడా నువ్వు ముఖ్యమా? ఏమో? ఆ సంగతి ఆ మనిషిని పుట్టించిన దేవుడికయినా తెలుసా?

కనీసం, నీకయినా తెలుసా అని?

నేను తిరిగి సమాధానం చెప్పేలోగానే సూర్నారాయణగారు అన్నారు.

'నీ బాకీ తాలూకు వడ్డీ ఇరవయి నాలుగురూపాయల తొంభయ్యారు పయిసలు తేలింది. రమణయ్య కూడా లెక్కవేశాడు. కావలిస్తే అడుగు. నువ్వేమో నిన్నటి రోజున ఇరవయినాలుగు రూపాయల తొంభయిరెండు పైసలే అంటివి అట్లాగే ఇస్తివి. ఏమయినా లెక్క లెక్కే. నాలుగు పైసల్తో మేడలు కడదామని దగా చేస్తివా?'

నేను రమణయ్య వంక చూశాను

రమణయ్య దిక్కు మొహం వేసి మొహం తిప్పించాడు.

నాకు నవ్వాలో ఏడవాలో తెలీలేదు. నేను సూర్నారాయణగారి గురించి తెలిసిన వాణ్ని పటంచేతా, పైగా అది నాబాకీ అయి వుండటంచేతా, ఆ లెక్కని ఒకటికి నాల్గుసార్లు వేశాను. ఇప్పటికి అందులో పొరబాటు వుందంటే నమ్మలేకుండా వున్నాను. రమణయ్య వీడుటే మళ్ళీ లెక్కగట్టాలన్పించింది.

కాని...తేడా ఎంత? నాలుగు పయిసలు; ఆమాత్రం దానికి మరలా అంత శ్రమ పడటం అనవసర మన్పించింది. జేబులోంచి నాలుగుపయిసలు తీసి ఆయనకిచ్చి వేశాను. సూర్నాయణగారి మొహంలో అప్యాయత వెంటనే వెల్లి విరిసింది.

'నాకు తెల్సు పంతులూ! నువ్వు నిజాయితీ పరు వి కాకపోతే పొరపాటు పడ్డావంటే కానీ వడ్డీ లెక్కల్లో పొరపాటు నేను హర్షించనని నీకు తెల్సు. నేను కాబట్టి సరిపోయింది. అదే మరొక రయితే ఎంత అపార్థం చేసుకుని వుండేవారు? ఆఁ.' అని సన్న సన్నగా చివాట్లు పెట్టారు.

నేను ఏడవలేక నవ్వునవ్వి సెలవు పుచ్చుకుని వచ్చేశాను. పాతకాలెండర్లని తిప్పుకుంటూ సూర్నారాయణగారు కుస్తీ పట్టున్నారు. రమణయ్య - చక్రవడ్డీకి తక్రవడ్డీ కట్టాలంలో మునిగిపోయి వున్నాడు, ఆ తర్వాత కొన్నాళ్ళకి నేను బదిలీ అయి మరోవూరు వెళ్ళిపోయాను. ఈ కొత్తవూరూ ఆ దగ్గరే గనుక అప్పు డప్పుడూ పట్నంలో రమణయ్య కనుపించే వాడు. అతని ద్వారా సూర్నారాయణగారి సంగతులు తెలిసేవి.

సూర్నారాయణగారు ఆ మధ్యన కొడుకు పెళ్ళి చేశారట.

ఆయన ఆరోగ్యం అంతగా బాగుండటం లేదట. షుగర్ కంప్లయింటూ, బ్లడ్ ప్రెషరూతో బాధపడుతున్నాడట, బాగా చిక్కి పోయాడట. ఆ మధ్యన ఏదో గొడవ వచ్చి డబ్బుగురించి—భార్య పుట్టింటికి వెళ్ళి పోయిందట. వెళ్ళిన రెండు నెలల్లోనే ఆవిడ అక్కడ గుండె జబ్బొచ్చి చచ్చిపోయిందట. చచ్చిపోతూ పుట్టింటి వారు ఇచ్చిన ఆస్తి కొంత పొలం వుంటే ఆదికాస్తా చెల్లెలికి రాసిచ్చిపోయిందట. దాన్నిగురించి పెద్దగొడవ జరిగిందట. అదట్లా వుంచి వూళ్ళో విరోధులు ఎక్కు వయ్యారట ఆయనకి!

ఇప్పుడు ఆయన్ని వూళ్ళో ఆదుకునే వాళ్ళెవళ్ళూ లేరట.

కొడుకు పట్నంలో కాపురం పెట్టాడట. అతనే అప్పుడప్పుడు వచ్చి పోతుంటాడట. గంజిపోసే దిక్కయినా లేదని జాలిపడి రమణయ్యే ఎవరో మనిషిని వంటకి కుదిర్చి పెట్టాడట. కాని నాల్గురోజులయినా తిరక్కుండానే ఆ మనిషిని అనుమానించి పొమ్మని వెళ్లగొట్టారట. తను గూడా కొడుకుదగ్గరే వుంటానని, ఇల్లమ్మేశారట! ఈమధ్యే.

సూర్నారాయణగారు అప్పుడప్పుడూ నన్ను తలుస్తూ వుంటారట!

నా మనస్సు ఆయన ఎడల ఆర్ద్ర మయింది.

పాపం! సూర్నారాయణగారు! మనిషి లోకానే; ఆ ఒక్క గుణం తప్ప.

డబ్బులుగారూ! మీకో దండంసార్! మీకు హృదయం వుందా? మీ జాతికి అసలు సార్థకత అనేది వుందా? ఉన్న పక్షంలో ఆ పెద్దమనిషిని అల్లా ఆక మించి పిచ్చివాణ్ణిచేసి ఆడించటంలో ఔచిత్యం ఎంత?

ప్చ్!

నువ్వు పాపిష్టిదానివి. నీ స్వరూపమే రొచ్చుగుంట. నీ విధానమే మాయాజాల

యంత్రా తంత్ర సమన్వితము: నిన్ను పుట్టించిన మనిషిని, సర్వ ప్రపంచాన్ని ఆఖరికి ఆ దేవుణ్ణి కూడా పిచ్చెక్కించి ఈ ప్రపంచాన్నే పిచ్చి మాలోకం చేస్తున్నావు. మానవత్వాన్నే మంట గలుపుతున్నావు...

* * *

నా ఆలోచనల్నుంచి ఒక్కసారి వులిక్కిపడి చూశాను. నూర్నారాయణ గారు ఆత్రంగా నావంక చూస్తున్నారు.

'పంతులూ! ఏంటాలోచన? ఒకమాట చెబుతాను. నమ్ముతావా?'

'చెప్పండి.'

'మూడు రోజుల్నించీ నాకు అన్నం లేదు. నిజం. ఎంతో ఆకలిగా వుంది. ఉత్త టీ తోనే సరిపెట్టేవు. టిఫినేమయినా?...

సర్వరుని కేకేసి టిఫినుకి ఆర్డరిచ్చాను. నా ఆలోచనల్ని గమనించినట్లున్నాడాయన.

'పంతులూ! ఆశ్చర్యపోతున్నావా? నిజమే. నా గురించి నేనే ఆశ్చర్యపోతాను ఇప్పుడు. ఉన్ననాడు అనుభవించింది లేదు. నేను తిన్నది లేదు. ఒకడికి పెట్టింది లేదు. పాపం లేదు. పుణ్యం లేదు. పాపం పోగు చేశాను. డబ్బు మూట గట్టాను. మూట చూసి మురిసిపోయాను. అంతేగాని దాని ఉపయోగం తెల్సుకోలేక పోయాను. అన్న లేడు. తమ్ముడు లేడు. నేనూ లేను. ఉన్నదంతా డబ్బే అనుకున్నాను. డబ్బే సర్వం అనుకున్నాను.

పోగు చేసి అంతా కొడుకు చేతిలో పెట్టాను. ఇన్నేళ్లనించి నేను కూడబెట్టింది, వాడు 'సార్థకం' చెయ్యటానికి ఎన్నాళ్లో పట్టలేదు. అంతా అయిపోయిందయ్యా. కోడలుకి నా పొడ గిట్టదు. నా సంగతి నా కొడుక్కి పట్టదు. ఇన్నేళ్లూ నేను డబ్బుని పోగుచెయ్యటంలో పిచ్చాడినయ్యాను. వాడు దాన్ని నాశనం చెయ్యటంలో పిచ్చాడయ్యాడు. ఇన్నాళ్లూ నన్ను నేనే మర్చిపోయాను. ఇప్పుడు నన్ను నా కొడుకేగాక నేను కూడబెట్టిన డబ్బుకూడా మర్చిపోయి పారిపోయింది. నా బ్రతుకిట్లా అయింది...'

నూర్నారాయణగారి కళ్లలో నీరూరటం నేను గమనించాను. అప్రయత్నంగా నిట్టూర్చేను.

# డా॥ ఎస్. కె. దత్తా



హాఫ్‌కిన్ ఇన్‌స్టిట్యూట్ (బొంబాయి) డైరెక్టర్ డా. ఎస్. కె. దత్తా, వైద్య శాస్త్ర పరిశోధనల్లో అఖండ విజయాలు సాధించారు. వీరు ముఖ్యంగా కలరా వ్యాధిని కలిగించే సూక్ష్మజీవి ఒక విష పదార్థాన్ని ఉత్పత్తి చేస్తుందనీ, దానివల్ల కలరా వస్తుందనీ వీరి పరిశోధనలవల్లనే తెలిసింది. డా. దత్తా, వారి బృందం 7 ఏళ్లపాటు పరిశోధనలు జరిపి మనదేశంలో దొరికే ఒక మొక్కనుంచి తీసిన బర్బెరిన్ అనే ఆల్కలాయిడు తీవ్ర విరేచన రోగాన్ని నయం చెయ్యడానికి పనికొస్తుందని కనిపెట్టారు. ఇప్పుడు ఈ మందు విరివిగా అమ్మకం అవుతోంది. ఇలాగే వీరు మనదేశంలో దొరికే చాలా యితర మొక్కల్నించి లభించే మందుల్ని గురించి పరిశోధనలు జరుపుతున్నారు.

డా. నిర్మల్‌కుమార్ దత్తా 1937 లో కలకత్తా విశ్వ విద్యాలయంలో యం. బి. బి. యస్. డిగ్రీ తీసుకుని, కొంతకాలం సర్ రాంనాథ్ ఛోప్రాతో కలిసి బయలాజికల్ స్టాండర్డైజేషన్ లాబరేటరీలో పని చేసారు. తర్వాత లండన్‌లో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రిసర్చిలోనూ, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో డా. ఎఫ్. సి. మాకింటాష్, ప్రొ జె. హెచ్ బర్న్, ఎఫ్. ఆర్. ఎస్. ల వద్ద పనిచేసి 1946 లో డి. ఫిల్. డిగ్రీ సంపాయించారు. 1964 లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ వారు డా. దత్తాకి బాక్టీరియాలజీలో డి. ఎస్. సి. డిగ్రీ ఇచ్చారు.

డా. దత్తాకి చాలా బహుమానాలు సన్మానాలు లభించాయి. వీటిలో బసంతీ దేవి అమీర్‌చంద్ బహుమానం (1956) జి. జె. వాట్‌మల్ అంతర్జాతీయ బహుమానం (1965) శాంతిస్వరూప్ భట్నాగర్ బహుమానం (1967) ముఖ్యమైనవి.

డా. దత్తా ప్రచురణలు 75 ఉన్నాయి. మన దేశంలోనూ, విదేశాల్లోనూ ప్రచురితమయ్యే వైజ్ఞానిక పత్రికలకి సంపాదకులుగానూ, సంపాదకవర్గ సభ్యులుగనూ ఉన్నారు. జర్నలిజం వీరి హాబీ.

డా. దత్తా రష్యా, అమెరికా, జపాన్, ఇంకా చాలా దేశాల్లో ఉపన్యాసాలిచ్చారు. అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొన్నారు. వీరు ప్రపంచ ఆరోగ్యసంస్థ (డబ్ల్యు. హెచ్. ఒ.) సలహాదారుగానూ, నిపుణుల బృందంలో సభ్యులుగానూ ఉంటున్నారు.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి.

# పరివేష్టం

సీరియల్

శిఖా వెంకటరమణ



### జరిగిన కథ

జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కి మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తు పడతాడు గాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. జయ సాంబుని గుర్తుపట్టినట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు. మార్గరెట్ సాంబుచేత తిరస్కరింపబడి స్వదేశానికి వెళ్ళిపోతుంది. కాళిదాసు భారతి భార్యాభర్తలవుతారు. జయ గర్భవతి అవుతుంది. కాళి సాంబు కోసం వెతుకుతాడు. అతను దొరకడు. జయ ప్రసవించగానే బిడ్డ మరణించాడు. కాళిదాసు కొడుకునే తన స్వంత కొడుగ్గా పెంచుకుంటుంది. మళ్ళీ పెళ్ళి చేసుకోవాలన్న అభ్యర్థనని జయ కొట్టి పారేస్తుంది.

## 10

మిడిల్‌స్కూలు చదువులు పూర్తిచేసి హైస్కూలు చదువుల్లో ప్రవేశించేరు రఘురావ్ మోహన్‌లు. పూర్వంవలె ఆట పాటలతో, కేరింతలతో, సినిమా కబుర్లలో కాలక్షేపం చేయడం యిద్దరూ మంచి పద్ధతులు కావని గ్రహించేరు. రఘురావ్ నమ్రతగా స్కూలు మొత్తం టీచర్లందరికీ తలలో నాలుక మాదిరిగా మెలిగే మనిషి. మోహన్ మానసికంగా స్వభావంలో దురుసు మనిషి. దానికితోడు అతను కరుకుతీరిన శరీరంతో కడ్డీమాదిరిగా వుంటాడు. ముక్కుకు సూటిగా వున్నది అనేయడమే అతని లక్ష్యం.

కాన్వెంటుస్కూల్లో క్రమబద్ధమైన శిక్షణలో మేపుగా పెరిగిన యిద్దరు పిల్లల్నీ చూస్తూ ముగ్గురూ రకరకాలుగా ఆలోచిస్తారు. కాళిదాసు కళ్ళు పైకెత్తి మనస్ఫూర్తిగా చూడలేడు. నిన్న మొన్నటి పిల్లలు తండ్రిలో సమానంగా యెదిగి సవాల్ చేస్తున్నట్లుగా వుంటే అతని మనసు వేదనాపూరితంగా అయి ఆ క్షణాన 'భగవాన్'! నన్ను క్షమించు,' అనుకుంటాడు నిశ్శబ్దంగా.

'ఈ బ్రతుకు భారంలో, చీకటి యానంలో ఒంటరిగా యిన్నేళ్ళు ప్రయాణించి అలసిపోయేను. యింక చాలును ఈ జీవితం. నా బిడ్డడే వుంటే... అయిన వారికి దూరం అయి, ఆశలు రేపి కోటలు గట్టించి తీరుతానని వాగ్దానం చేసిన ప్రియుడు భీరువులా పారిపోగా యెందుకీ నిష్ఫల జన్మ... పసికందుని సమాజాన్ని యెదిరించైనా బ్రతికించుకుని పోషించలేక పోయేదాననా? లక్కడ కూడా దైవం యెందుకీ రాతని వక్రదారి పట్టించేడు,' అని మథనపడుతుంది జయ.

భారతి కళ్ళు ఆనందంతో, మిలమిల లాడుతూ తృప్తిగా గుండెలనిండుగా పీల్చుకున్న వూపిరి బయటికి రాగా 'నా బిడ్డలు' అనుకుంటుంది.

జయ బీచ్‌తీరంలో కారుని ఆపేసి సముద్రంవైపూ, యెగిసిపడే కెరటాల వైపూ చూస్తూండి పోయింది. మానసికోల్లాసానికి తప్ప తనకీ బాహ్యప్రపంచం మరీ దుర్భరంగా గోచరించినప్పుడే నీలు చేసుకుని అలా వొంటరిగా కారుని నిశ్శబ్దంగా వున్నవైపు ఆపడం ఆమె అలవాటు.

మన్మోహన్ కృష్ణ సరళ యింట్లో పరిచయం అయిన తరువాత యెన్నో పర్యాయాలు ఆమెతో మాటాడేడు. ప్రత్యేకం అతను ఆ క్లినిక్‌కి రావడంకూడా యెన్నో సార్లు జరిగింది. కాళిదాసు అతని రాకపోకలకి వికృతార్థాలు యెప్పుడూ కల్పించుకోలేదు.

జయ ఆలోచనలకి అంతరాయం కలిగింది. మన్మోహన్‌కృష్ణ చిన్నగా దగ్గి తన రాకను గుర్తుచేశాడు. 'మీరు యిక్కడ అప్పుడప్పుడు కనిపిస్తూనే వుంటారు. యిన్నాళ్ళూ పలకరించేందుకు ధైర్యం చాలలేదు. మీకు యేమీ అభ్యంతరం లేదుకద' అంటూ యిసుకలో చతికిలబడ్డాడు.

చిన్నపిల్లల అల్లరిలో, పెద్దవాళ్ళ రాజకీయాలతో చాలా సందడిగా వున్నది బీచ్ ప్రాంతం. పదహారేళ్ళు దాటుతూ ఫిఫ్తుఫారం చదువుతున్న మోహన్ ఆ ప్రాంతంలో ఆ భంగిమలో కనిపించగానే జయ అదిరిపడింది. మన్మోహన్‌కృష్ణ ఆవిడవైపు తిరిగి. 'మిమ్మల్ని బాధ

పెట్టేవరం వ్యాయం కాదు. యేమీ అనుకోక పోతే ప్లీజ్, మిగత విషయాలలో నాకు సంబంధం లేదని విన్నవించుకుంటున్నాను' అన్నాడు.

జయలక్ష్మి మొహంమీద విషాదరేఖలు తప్ప వార్ధక్యపు ఛాయలు బొత్తిగా కనిపించవు. వేదనామయమైన ఆవిడ నిర్భాగ్యపు జీవితంపట్ల ప్రపంచపు సాను భూతి యెంతవరకూ వుంటుందనేది అర్థంలేని ప్రశ్న. తెలిసిచేసినా, తెలియక చేసినా మన సమాజంముందు జయలక్ష్మి యే అర్హతలూ లేని దౌర్భాగ్యురాలు. జయ నిద్రలోంచి లేచినదాని మాదిరి తలయెత్తి అడిగింది. 'మీరు అడిగేదేమిటో నాకు అర్థం కావడం లేదు. కొంచెం వివరంగా చెప్పండి.'

'నా జీవితకాలం రిసెర్చిలోనే గడిచి పోయింది. యిప్పుడు వాస్తవంలోకి రాగానే నాకూ నా తోడు కావాలని, ఆవిడ నన్ను ప్రేమించగలదై వుండాలనీ, పిచ్చిగా కోరిక కలిగింది. యిది అత్యాశ కావచ్చును. యిన్నేళ్ళు అవివాహితుడిగా వున్నందుకు మావాళ్ళు అనబడే అనేకమంది ప్రశ్నల పరంపరలు వేసి చివరకు పవిత్రంగా వున్నాడా యిన్నాళ్ళూ' అని తేల్చిపడేశారు. అందుకే నేనో నిర్ణయానికి వచ్చేను.

'యేమిటో చెప్పమంటరా?'

జయ వేదాంతిలా నవ్వింది. క్షమించండి. మీ వుద్దేశ్యం నాకు అర్థం అయింది. జీవితంలో అందరిలా పొరబాటు చేయలేదు నేను. సాంబశివం నా భర్త. ఆ సంగతి మీ అందరికీ విచిత్రంగా అనిపించవచ్చును. వూహ తెలిసిన తరువాతైనా నన్ను నేను సరియైన మార్గాన నడిపించుకోక తప్పదు', 'మరోమాట. మీరెప్పుడూ యింక నాకు కనిపించకండి. మీ వుద్దేశ్యం [illegible] నేను మిమ్మల్ని పరోక్షంగా మీ యిూ అంతు రార్పణకి దోహదం చేసేదాన్ని కాదు. నేను మీరనుకునేంత ప్రౌఢయువతిని కాను. కాలం వేయకపోయినా ఆముద్ర నన్నావరిస్తే నేను యిూ పాటికి...' జయమాటల్ని ఆపేసి చరచరా నడిచి కారుదిక్కుగా వెళ్ళిపోయింది.

గడపలో అడుగుపెట్టిందే తడవుగా యింట్లోంచి కేకలూ, పెడబొబ్బలూ రకరకాల చప్పుళ్ళూ వినిపించేయి. పైఅంతస్థులో కాళిదాసు కొరడా శబ్దం అది. భారతి యేడుపు పక్కనే వినిపిస్తోంది. జయ అక్కడే గుమ్మంలో ఆగిపోయింది:

'మీ కాళ్ళు పట్టుకుని ప్రార్థిస్తాను ఈ ఒక్కసారికీ వాడిని వదిలేయండి. ఇక మీదట వాడిని అదుపాజ్ఞల్లో వుంచుకునే భారం నాది. నా మాట వినండి... యావండీ!' భారతి మాతృహృదయం



వేదనా పూరితం అయిపోయి గాలిలో దీపంలా రెపరెప లాడుతోంది.

'వినేల్లేదు. నీకు తెలీదు భారతీ. వాడు దూదిపాములో నిప్పు రవ్వలాంటి మనిషి. యిలాంటి వ్యక్తులు సంఘానికి చీడ పురుగులు. ఆ వెధవని చంపేసి నేను చచ్చిపోయేందుకు సైతం వెనుకాడను. దౌర్భాగ్యుడు పెద్ద తరం చిన్నతరంలేకుండా యెంతమాటన్నాడు'

భారతి కొడుకువైపు చూసింది. పైమెట్టుమీద నిలుచున్న జయకి స్పష్టంగా కనిపిస్తోంది. గదిలో దృశ్యం. స్తంభానికి కట్టేసి మోహన్‌ని చితక తన్నుతున్నాడు కాళిదాసు. జయ చూసిన దానికీ, దీనికీ సమన్వయం కుదరనిదానిలా గుచ్చిప్పగించి చూస్తూండి పోయింది.

భారతి కొడుకుని ప్రాధేయపడుతూ అడుగుతోంది. 'మోహన్ యెందుకురా అన్నిదెబ్బలు తింటావు. నీ శరీరంమీద పడే ప్రతి దెబ్బా నా మనసుని రంపపుకోత కోస్తున్నాయిరా. తప్పు ఒప్పుకుని కాళ్ళమీద పడు నాయనా'

'నాకేం అవసరం లేదు. నేనేం అబద్ధం ఆడడం లేదు. పిన్ని అలసూ యిప్పటివరకూ బీచిలో కూర్చున్నారు' ఒక్కసారి జయ మొహం పాలిపోయింది. వెనక్కి చేరగిలబడి బలవంతాన కాళ్ళని నిలద్రొక్కుకోవాలనే ప్రయత్నాన్ని చేసి విఫలురాలై పోయింది. మెట్లమీద మసకలు క్రమ్మేసే సమయంలో మోహన్ మాటల్ని మరీ మరీ గుర్తుకు తెచ్చుకోవాలనుకుంది. కానీ... జయకి అంతు పట్టలేదు.

కాళిదాసు అలసిపోయేడు. తలుపులు తెరుచుకుని బయటికి అడుగుపెడుతూ చిగ్గొంతు డయ్యాడు. భారతి భర్త మొహంలోంచి చూపుల్ని తప్పించుకుంది. అనుభవంలో మనిషి విలువా, వ్యక్తిత్వం తెలుసుకుని జయపైగల నమ్మకానికి గౌరవం యిచ్చి గట్టి పునాదులే వేశాడు కాళిదాసు. చేతిలోకి సిరెంజ్‌ని తీసుకుని జయకి యింజక్షన్ యిచ్చేడు. తెలివి వొచ్చేవరకూ తలగట్టునే కూర్చున్నాడు. భారతి పరిచర్యలు చేయసాగింది.

కళ్ళుతెరచిన జయ చుట్టూ చూసింది. కాళ్ళవైపు రఘురావ్ దీనంగా చూస్తున్నాడు భారతి ఒకవైపూ కాళిదాసు మరొకవైపూ కూర్చున్నారు. కాళిదాసు చేయి జయ శిరస్సుమీద వున్నది: 'యెంత పని చేశావు బావా', మోహన్‌కోసం జయ కళ్ళు గాలించేయి.

కాళిదాసు నిబ్బరంగా సమాధానం యిచ్చేడు: 'అదృష్టం బాగుండి బ్రతికి పోయేడు. యివాళ వాడో నేనో తేల్చుకోవాలనుకున్నాం. దరిద్రుడు యింటా వంటాలేని బుద్ధులు వచ్చేయి.'

మోహన్ హాల్లో నిలబడే వున్నాడు. 'నేనన్నది తప్పని ఆవిడ నోటిమీదే చెప్పించండి. అప్పుడు దౌర్భాగ్యుడినో, దరిద్రుడినో తెలుస్తుంది.'

కాళిదాసు చటుక్కున లేవబోతూంటే చేయివేసి బలవంతాన ఆపింది జయ: భారతి కళ్ళు నిప్పుకణాల మాదిరిగా అయిపోయేయి. ఆవిడ వూహకందని వ్యక్తి. కన్నీరు అప్పుడప్పుడు కలియ తిరుగుతూంటే నేలచూపులు చూస్తూండి పోయింది.

'ఒద్దు బావా! నామీద ఒట్టు. అంత ఆవేశం తగదు. వాడు అబద్ధం యేమీ ఆడలేదు. బీచ్‌లో నేనూ మనోహన్ కృష్ణ కూర్చోవడం మోహన్ ప్రత్యక్షంగా చూశేడు.'

'చూస్తే?', కాళిదాసు మండిపడుతున్నాడు.

'సమాజం యెలా చిత్రించుకుంటోందో వాడి నోటితో విన్నాను. తప్పేం వుంది. పెళ్ళికానిదాన్ని, జీవితంలో తప్పటడుగు వేసినదాన్ని'

'అందుకని'

'నలుగురూ అనుకునే విషయాన్ని చెప్పేడు.'

'నువ్వు ఒప్పుకుంటున్నావు.'

'నిజాన్ని ఒప్పుకోవడంలో తప్పేంలేదుగా'

'యేది నువ్వనే నిజం?'

'నేనూ అతను కూర్చోవడం'

కాళిదాసు గొంతు ఖంగుమన్నది: 'భారతీ రఘురావ్‌ని బయటికి పంపించు,' భారతి కొడుకుని పంపేసింది.

జయ మంచంమీద లేచికూర్చుని అన్నది: 'అతను నన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడు బావా! వీలుపడదన్నాను. నా బ్రతుకుమీద అతనికి సానుభూతి వున్నదన్నాడు. తను రిసెర్చ్ స్కాలర్ కనుక హోదాకి లోపంలేని నన్ను చేసుకోమన్నాడు. నాభర్త సాంబశివం యెప్పటికైనా తిరిగి వస్తాడనీ, ఆ ప్రయత్నం మానుకోమనీ క్షమించమనీ చెప్పేను'

భారతీ, కాళిదాసూ వింటూనే నివ్వెర పోయేరు. జయలో ఆత్మవిశ్వాసంతో కూడిన ఫలితంలేని నిరీక్షణ యెంతవరకూ జయాన్ని పొందుతుందో ఆలోచిస్తూండి పోయేరు.

* * *

అన్ని రిజల్ట్సు వచ్చేయి. మెట్రిక్ పరీక్షాఫలితాలు ఆవేళ వస్తాయని పెందలకడే లేచారు భారతీ, జయా. కాళిదాసు వీధి వాకట్లో వాలు కుర్చీలో కూర్చుని పేపరు వాడి బెల్‌కోసం యెదురుచూస్తున్నాడు. ఈ సంవత్సరం పిల్లలు గట్టెక్కితే వారిద్దరికీ యిష్టమైన చదువులు చెప్పించవచ్చును. యిదీ అతడి ఆలోచన.

అనుకున్నటైముకి పేపరు కుర్రాడు పేపర్ను పడేశాడు. రఘురావ్ అస్వస్థత కారణంగా ఒక సంవత్సరం పరీక్షలు వ్రాయలేక పోయేడు. సునిశిత బుద్ధి కల మోహన్ డబుల్ ప్రమోషన్లు అందుకుని ప్రైమరీ స్కూలులోనే లతని క్లాసు నందుకున్నాడు. యిద్దరూ ఒకేసారి మెట్రిక్ పరీక్ష వ్రాయడం ఆవిధంగా జరిగి పోయింది.

కాళిదాసు పేపరు తెరచి ఆనందంతో యింట్లో అందరినీ పేరు పేరునా పిలిచేశాడు. వరుసన వచ్చారు జయా, భారతీ, పిల్లలూ.

'పిల్లలు ఫస్టున పాసయ్యేరు భారతీ,?' అన్నాడతను ఆనందావేశాలతో.

భారతి యిద్దర్నీ గుండెలకి చేర్చుకుంది. తల్లికీ తండ్రికీ పాదాభివందనం చేశాక జయకి నమస్కరించేరు. జయ యిద్దర్నీ అస్పష్టంగా ఆశీర్వదించింది.

కాళిదాసు అడిగేడు: 'యేరా రఘూ నీకేం చదవాలనుంది. నువ్వు కూడా మోహన్. మళ్లీ మళ్లీ తెలుసుకునేందుకు నాకు వీలుచిక్కదు.'

రఘురావ్ అన్నాడు: 'నాకు 'లా' చదవాలనుంది నాన్నగారూ. తాతగారు కూడా చిన్నప్పుడు నన్ను సపోర్టు చేసేవారు'

'నేను బి. కాం చదువాలను కుంటు న్నాను' మోహన్ అన్నాడు.

యెప్పుడింక తప్పదు. నువ్వు 'ఆ పిల్లను నా కంఠంలో ప్రాణాలు వుండగా, చేసుకో లేవు.'

'హుఁ', నిర్లక్ష్యంగా నవ్వేడు మోహన్: 'కాదా మరి. కన్నకొడుకుగా నెత్తిన పెట్టుకునే అదృష్టం, పెట్టుకున్న ఫలితం దక్కే అదృష్టం అవి కొందరికే నాన్నగారూ'

జయ విస్మయంగా చూడసాగింది. మోహన్ సౌకుమార్యం [illegible]. ఆ పిల్లెరిలో కాఠిన్యం పొరలు వేస్తోంది: 'నేను చిన్న వాడినని మీరు నా పేరు మార్చవేయాలని చూడకండి ... నా చేతుల్లో వున్నాయి నా యిష్టాయిష్టాలు. మీరు బలవంతాన పెళ్ళిచేసినా ఆ పిల్ల గొంతుకకి వురి త్రాడు బిగించినవారే అవుతారు. నేనంటే ఒడ్డీగారికి చాలా అభిమానం వుంది'

కాళిదాసు ఆవేశం చెప్పలేని యెగిరి పడ్డాడు: 'ఓండవా మరి? సత్సంప్రదాయాలమధ్య, పరువు ప్రతిష్ఠలు గలిగించుకుని [illegible] గౌరవించుకున్న నీ [illegible] మహానగరంలో మనతో వియ్యం అందుకునుకు జస్టిస్ గారు అవమానం చూపించరా? పిల్లని నాయింటికి పంపి దక్కర కాళిదాసు కోడలు అనిపించుకుంటే చాలని చూస్తున్నాడు కాబోలు. అది ఈ జన్మలో జరగనిపని.'

మోహన్ ఒక్కసారి నవ్వేడు. ఆ నవ్వుకి మేడ గోడలు కూలేనా, భూకంపం వచ్చి ఆ పరిసరాలే నీగిపోతున్నాయా అంతు చిక్క లేదు. మాటల యుద్ధాన్ని మౌనంగా వింటున్న ముగ్గురూ అప్రతిభులే అయిపోయేరు.

'రఘురామ్ వొప్పుకోగ లేదని. [illegible] దుకా కండవారం'

'హుఁ', వాడు వొప్పుకోక యేంచేస్తాడు. పెంచిన విశ్వాసం వాడికిగాని నా కెందుకు?'

కాళిదాసు మొహం [illegible] పోయింది. అతను కొంచెం తగ్గి యెదురు పెళ్ళి కొడుకు మీదకి యెగిరేడు: 'నిన్ను మొదటినుంచి గారాబంగానే పెంచేను. నీ మొండితనం పట్టుదల [illegible] మాదిరి అయిపోతాయనే భయం నాకు వున్నది యెందుకో. నువ్వు నా బిడ్డవి. మన పరువు నష్టం తెలిసిపోయేక [illegible]

లేదు యేమీ లేదు. నీకు అర్థం చెప్పేను. యింతవరకూ నన్ను వేలెత్తి చూపించిన వారు లేరు. ఇప్పుడు నీవల్ల అలా జరిగిపోతే...నాబాధ నువ్వు అర్థంచేసుకో. నువ్వు గుడ్డిగా నమ్మిన సూత్రాల నాధారంగా చేసుకుని ఆ మాలపిల్లతో కులుకుతానంటే సమాజం తాటాకులు కడుతుంది, ఆ చప్పుళ్ళకి వినోదంతో చప్పట్లు కొడుతుంది. నీ ఒక్కడితో పోయేది కాదు యిది. వంశానికీ, కులపట్టింపులకీ నాంది పలుకుతుంది. నీ తరువాత మేమందరం నువ్వు చేసిన ఈ పనికి బ్రతికి వున్నన్నాళ్ళు చిచ్చు అనుభవించాలి.'

మోహన్ తలెత్తి చూశాడు. భారతి గోడకి తలను ఆన్చి యేడుస్తోంది. జయ అర్థంకానిదానిలా నిలబడి పోయింది: 'అయితే మీ యిష్టం యేమిటో చెప్పండి'

'నువ్వీ పెళ్ళికి వొప్పుకోవద్దు మోహన్. నేను బ్రతికివుండడం యిష్టం లేకపోతే నన్ను సాగనంపి నువ్వాపని చెయ్యి' కాళిదాసు భయంకర సత్యాన్ని కాపాడలనే వుద్దేశ్యంతో కొడుకుని సానునయంగా

## రచయిత(త్రు)లకి మనవి

కొందరు పాఠకులు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పడే రచనలు చేసినవారి చిరునామా కోసం రాస్తూ ఉంటారు. ఈ సమాచారం రచయిత(త్రు)ల అనుమతి లేనిదే తెలుపటం వీలుకాదు. కాబట్టి తమ చిరునామా ప్రచురణకి అభ్యంతరంలేని రచయిత(త్రు)లందరూ తమ వ్రాత ప్రతుల మీద ఆ విధంగా పేర్కొంటే బాగుంటుంది. (సం)

పై ప్రకటన దృష్ట్యా ఏదీ పరిస్థితులలోనూ రచయిత(త్రు)ల చిరునామాలకోరే ఉత్తరాలకి సమాధానం ఇవ్వటం జరగదు. సం)

అడిగేడు.

'అలాగే. కానీ ఒక్కషరతు, నేనీ యింటియాలో వుండదలుచుకో లేదు. నా యిష్టాలకి, అభిరుచులకి ఈ వాతావరణం పడదు.'

కాళిదాసు మౌనం వహించి వింటున్నాడు.

'రఘురామ్ పిన్నికొడుకనీ, వాడికోసం మీరేదైనా చేస్తారనీ నాకు తెలుసును నాన్నగారూ. కన్నకొడుకనే మమతే మీకు లేకపోయింది...'

'మోహన్' కాళిదాసు గొంతులోంచి అవిరామంగా పిలుపులు పడసాగాయి. అతను వుద్రేకంతో వూగిపోసాగాడు. జయ నిశ్చేష్టురాలై పోయింది. చేష్టలు దక్కిన దానిలా చూడసాగింది [illegible]

'[illegible] యూ గెటౌట్ ఆఫ్ మై హౌస్'

'నేనెప్పుడో ఆ ఉద్దేశ్యంలో వున్నాను. మీరు చెప్పాలని, అప్పుడే వెళ్ళాలనీ కూడా అనుకున్నాను కానీ...వుండండి. నేనిప్పుడు ధ్యానంలో లేను.'

'యేం యెందుకని?'

మోహన్ మాట్లాడలేదు కొంచెంసేపటివరకూ. జయ వెళ్ళిపోతున్నప్పుడు కాళిదాసు పాదాన్ని చుట్టేసింది: 'నువ్వు నిజం చెప్పు బావా: వీడు... వీడన్నమాట యెంత వరకూ నిజం? రఘు నిజంగా నా కొడుకా. యిన్నాళ్ళూ నన్ను మభ్యపెట్టి పెంచేవా? కాదు కదూ — నా కొడుకు మేజర్ ఆపరేషన్లోనే పోయేడనీ వీడు స్వంత కొడుకే అనీ నిజం చెప్పు. నేను వింటున్నది అబద్ధంకదూ. నన్ను సంఘాన్నుంచి రక్షించేందుకే నాటకం ఆడేవా? నా బావ యెప్పుడూ అలా చేయడు. అవునను బావా,'

కాళిదాసు చెప్పేయడం మానేశాడు. అతని అంతరంగంలో అనేక భీభత్స రణరంగాలు [illegible] మోగసాగాయి. భూకంపం వచ్చి ప్రళయతాండవం చేసే విచిత్ర ప్రకృతి మారి పోసాగింది. అతని చిత్త పరితాపానికి అంతూ దరీ కానరావడం లేదు. భారతి అతని మెడ చుట్టూ చేతులు వేసి భుజం మీద వాలి పోయింది. పన్నెనిమిది, పంధొమ్మిదేళ్ళ మంచి చెడూ, సుఖమూ—సిరిమూ అన్ని [illegible] సమపాళ్ళల్లో భరించిన ఆవిడకి

రఘురావ్ తన కొడుకు కాడనే వార్త పిడుగుపాటులా వుంది. దాని ప్రవాహాన యెదిగిన అతడు తన రక్తంలో రక్తం, ప్రాణంలో ప్రాణం అని పెంచుకుని గర్వపడిపోయిన ఆవిడ మాతృహృదయం రెక్కలు తెగిన పక్షి మాదిరి విలవిల్లాడ సాగింది: 'వాడన్నది అబద్ధం అనండి. వాడు...వాడు దేనికో జయమీద పగ పెంచుకుని ఈ మాట అన్నాడు. మొన్నటికి మొన్నా బీచ్ విషయంలో అసభ్యంగా మాటాడేడు. మీరు అన్నీ తెలిసినవారు. ఈ నిజాన్ని అబద్ధం చేయండి. రఘురావ్ నేను కన్నకొడుకు. జయకి పిల్లడు అప్పుడే పోయేడు. యిావండీ నావైపు తిరిగి నా కళ్లల్లోకి చూసి నిజం చెప్పండి. వీడు చెప్పిన అబద్ధానికే నా గుండె తరుక్కుపోతోంది. అదే నిజం అని మీరంటే నేనీ వార్తని భరించలేను. నా రఘురావ్...నేను కన్నతండ్రి అవునవండీ,'

కాళిదాసు గంభీరంగా అన్నాడు: 'ఔను భారతీ, వీడన్నది అబద్ధం కాదు రఘురావ్ మన పిల్లడు కాడు. జయ కొడుకే వాడు...జయ నోటమాట రాలేదు. భారతి నిలుచున్న చోటనే కుప్పలా కూలబడిపోయింది.

వరద వెల్లువలాంటి వుధృతమైన ఆవేశం అతణ్ణి తన వశం చేసుకుంది. అతని చేతిలో వున్న బెల్టు తీసుకుని మోహన్ వీపుమీద బలంగా చరిచాడు. మోహన్ మరింత రెచ్చిపోయేడు.

'మొదటి నుంచీ వాడంటే యింటిల్లిపాదీ ప్రాణం పెట్టేరు. వాడు 'కా' అన్నది కా మాదిరిగానూ 'కి' అన్నది 'కి' మాదిరిగానూ జరిపిస్తూ వచ్చేరు యిన్నాళ్లూ. తాతగారు దగ్గర నుంచి తోటమాలి వరకూ వాడిని మాలిమి చేసుకుని బుజ్జగించేవాళ్లే. అమ్మ మాత్రం... కన్నకొడుకు లిద్దరినీ సమానంగా చూసే ఆప్యాయతని యెలా పోగొట్టుకోగలిగింది? యింటికి పెద్దవాడనే అర్హతతో నా వునికిని అపహాస్యం చేసేరు. వాడు నాకన్నా అందంగా, తెలివితేటల్ని పుణికి పుచ్చుకోవడమే యిందుకు కారణం అంటే నేను వొప్పుకోలేకపోయేను'.

కాళిదాసు వింటున్నాడు.

# పరిలిప్తం

'నాది తప్పే చదువుకున్న విజ్ఞానాన్నీ, సంస్కారాన్నీ నొరునొక్కేసి పైశాచికంగా ప్రవర్తించేను. జయపిన్నికేదో గతచరిత్ర వున్నదని జడ్జీగారన్నారు. మీరందరూ గులాబీపువ్వులా చూసే ఆవిడని రెచ్చగొట్టాలి. యిదే నా ప్రథమ ప్రయత్నం. మీరు లేనపుడు మీ డైరీలు చూశాను. జయపిన్నికి పుట్టిన పిల్లవాడిని దాచేసి నాటకం ఆడేరు మీరంతా. తాతగారు యిందుకు సూత్రధారులు. ఈ విషయం బయట పెట్టేగానీ నాలో ఈర్ష్య చల్లారదు. వాడిగుట్టు నా చేతిలో వుంది. అందుకే ... అందుకే యిలా తిరుక్కున్నాను నాపగ. నేను ఆ పిల్లను చేసుకుంటానంటే మీరెందుకు కాదంటారో యిప్పుడు చెప్పండి'

కాళిదాసు క్షణం ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా అన్నాడు: 'అర్థమైంది. నువ్వేదో విప్లవ ఘడియల్లో పుట్టివుంటావు. ఆ మెరికా వెళ్ళు, యింగ్లాండు వెళ్ళు నాకేమీ అభ్యంతరం లేదు. నేను నీ ఖర్చులన్నిటినీ చిరునవ్వుతో భరిస్తాను. కాళిదాసు కొడుకు జడ్జీగారమ్మాయిని చేసుకున్నాడనే వార్తకన్నా ఈ ప్రయాణమే వేయిరెట్లు మేలుగా తోస్తోంది. నీ బ్రతుకు నువ్వు బ్రతికి సమర్థుడివి అవుతావనుకున్నాను. కానీ ఈ మాదిరి పోకిళ్లకిపోయి కొంపకు నిప్పు పెడతావనుకోలేదు. నాకు వొక్కడే కొడుకనుకుంటాను ... నీతో సంబంధం ఈనాటితో సరి'

మోహన్ తలుపులు బిడాయించుకున్నాడు. ఆ రాత్రి యే ఒక్కరికి నిద్రపట్టలేదు. రఘురావ్ క్లినిక్‌లోనే వుండిపోవడంతో ఈ రసాభాస అతనిచెవికి యెక్కలేదు. యెవరికివారే తప్పిదం చేసిన వారిలా తలగడల్లోకి తలలుదూర్చి పడుకున్నట్లు నటించేరు. కాళిదాసు వెల్లకిలా పరుండి ఆలోచించ సాగాడు. భారతి తలుపు గడియపెట్టి అతని కాళ్లగట్టుకు చేరువలోకి వచ్చి కూర్చుని అతని పాదాలమీద చేతులు వుంచి అడిగింది: 'యింత దారుణంగా నన్నెందుకు మోసం చేసేరు మీరు, వాడివి...వాడు నా కొడుకు. యిప్పుడు బలవంతంగా నాకు దూరంగా లాక్కువెళ్లిపోతోంది జయ. వాడు లేకుండా నేనెలా బ్రతకను.'

కాళిదాసు దీర్ఘంగా నిట్టూర్పు విడిచేను. అతను భార్యమొహంలోకి సూటిగా చూడలేకపోయినా యథార్థంగా చెప్పాలనే అనుకుంటున్నాడు. 'మీరు తప్పిదం చేయలేదంటారా ? నీ బిడ్డడే పోయేడనీ, వీడిని చూసి మరచిపో అనీ జయపరువు కాపాడమనీ ఒక్కసారి అంటే నేను మీ ఆజ్ఞమేర బ్రతికేదాన్ని కాదంటారా ? జయని చులకనచేసి మీ పరువు బజారు కీడ్చేంత హీనస్థితికి దిగజారి పోయేనా మీ వుద్దేశ్యం ?'

'నా మనసుని ఒక్కసారి మీలో చిత్రించుకోండి. ఆడదాని మనసు యెంత కోమలమో, అంతటి వజ్రసదృశం కూడా. యివాళ్టి రోజున వీడు నా కొడుకు కాదంటే నేనేమైపోను. ఆ కఠోరనిజాన్ని పుటిట్లోనైనా భరించ గల్గుదునే యిలా చేయమని మీకెవరు చెప్పారు ?'

'రాఘవరావుగారు', ఒక్కొక్క మాటే కొత్తపలకేడు కాళిదాసు. భారతికళ్లల్లో నీళ్లు అవిరామంగా వర్షిస్తున్నాయి. యిన్నేళ్లు ప్రాణం పెట్టుకుని పెంచిన కొడుకు తనవాడు కాదంటే ఆవిడ మాతృహృదయాన్ని గొడ్డలితో చీలికలు చేస్తున్నట్లూ, హృదయంలో చిమ్మ పెట్టినట్లూ వీగిపోసాగింది. అతను లేచి కూర్చుని భారతిని గుండెల్లోకి చేర్చుకున్నాడు: 'జయ కన్నబిడ్డని పుట్టగానే దాచేశాం. భారతీ మూడునాలుగు రోజుల్లో ప్రసవం కాబోయే నీ పక్కన వాడినుంచి కవలలు పుట్టేరనీ చెప్పాలనుకున్నాం. కానీ విధి వక్రించింది. నీకు పుట్టిన బిడ్డడు అప్పుడే పోవడం, నువ్వు స్మారకంలో లేకపోవడం అంతా దైవనిర్ణయాలుగా జరిగిపోయేయి. ఆయన చెప్పింది సబబుగా తోచింది. తొలిచూలు బిడ్డడిని పోగొట్టుకున్న నీ పరితాపం గ్రహించి ఆయన చిత్రంగా నాకు బోధించేరు. జీవితాన్ని పుటలు పుటలుగా చదివిన ఆయనకన్నా నాకు యెక్కువగా తెలియదనే నిర్ణయానికి వచ్చేను. నీ కింత కష్టం కల్గిస్తానని కలలో కూడా అనుకోలేదు భారతీ ... వాడు యివాళ విషయం బయటపెట్టే వరకూ నేనెంతో జాగ్రత్తగా వున్నాననీ, ఈ జన్మకీ రహస్యం ఏ ఒక్కరికీ తెలియదనీ ఆశించేను. కానీ ...

యేలా జరుగుతుందనుకోలేదు.'

'ఇది యింత క్షమించరాని తప్పు అవుతుందని ఆనాడే తెలిసివుంటే తప్పనిసరిగా ఆ చేదు నిజాన్ని లోకానికి యెత్తిచూపించి భరించవలసిన కష్టాన్నేదో సంతోషంగానే భరించే వాడిని. తల్లి తండ్రీ దూరం అయిపోయేరు జయతండ్రి నన్ను చదివించే డనే కృతజ్ఞత వల్లనే అయివుంటే ఆ డబ్బు నేను నిమిషాలమీద చెల్లించేవాడిని. జయ ఆ పరిస్థితిలో చేసిన తప్పుని దయనీయంగా ఆలోచించి నీ కష్టానికి కారణభూతుడినే అయ్యేను. నేను క్షమించరాని తప్పిదం చేసేనంటావా భారతీ!' కాళిదాసు మొహం వివర్ణం అయిపోయింది. అతను పంధొమ్మిది సుదీర్ఘ సంవత్సరాలు మూడవకంటికి తెలియనివ్వకుండా దాచి వుంచిన భయంకర సత్యాన్ని యివాళ పదిమందీ గుర్తించగానే దావానలం మధ్య నిలబడ్డవాడిలా దహించుకు పోసాగేడు.

భారతి పైకి యేమీ అనలేదు. అంతరంగంలో ఆలోచిస్తోంది. చేవు వచ్చినపుడు రఘురాముకోసం విలవిల్లాడిన ఆవిడమమత ఈ టూకు హృదయం అప్పుడు కాదు యిప్పుడు ఇన్నేళ్ళ పైబడ్డ, ఆ బిడ్డ కోసం కలియమూస్తోంది [illegible] చనువుల సహాయంతో. ఆకాశంమీద చందమామ [illegible] ఆ బిడ్డ [illegible] పాలబువ్వలో [illegible] జోడించి 'చందమామ రావే' అంటూ చిన్నారిని బలవంతం చేసి గోరుముద్దలు తినిపించడం గుర్తుకు రాగానే తుమ్మముల్లు యెదలో గుచ్చుకున్నట్లే అనిపించసాగింది. మూడేళ్ళ బిడ్డను గుప్పెట్లు [illegible] పరిపెట్టి తననితాను మరచిపోయిన అన్నా వరులో మాతృత్వం పొందింది...యిన్నేళ్ళ తరువాత ఈ బిడ్డడు నాది అనే అదృశ్య కబంధ హస్తాలు — సర్వం మరచి ఆలో చించే ఆవిడ [illegible] పొలుస్తోంగే పసిబిడ్డడి మాదిరిగా, తనసుంచి దూరంగా [illegible] పాదాలపైన అన్ని [illegible]. కాళిదాసు దిక్కు మొహం వేసి సహాయుడిలా తను చేసింది మంచో— చెడో నిర్ణయించుకోలేని స్థితిలో నిర్జీవ శిలాప్రతిమే అయిపోయేడు.

జయ బలవంతాన నిద్రమాత్ర వేసుకొని అప్పటిమటుకు తాత్కాలిక ఉపశమనం పొందింది. (ఇంకావుంది)

# అభాగ్యోపాఖ్యానం

[ఒక ప్రముఖ రచయిత "శిశిర" కలం పేరుతో పంపిన గేయాన్ని యధాతధంగా వేస్తున్నాము. —సం.]

పట్టపగలు నడివీధిని
పడుచుపిల్ల నడువలేని
దుస్థితిలో నున్న దాని
వో అభాగ్య రాజధాని!

రజాకార్లు తెగబలిసిన
రోజుల్లో నీ రెక్కడ?
నైజాము నిరంకుశాగ్ని
రాజినపుడు నీ రెక్కడ?

పదవి చేయిజారి పోవ
పగపట్టిన పాపరేండ్లు
నీ మెడలో బిగిసినారు
తెలుగు తల్లి! తెరువుకండ్లు.

బలుసాకును వెదకికొనుచు
పిక్కబలము జూపినారొ?
చెక్క భజనతో నవాబు
చంకకింద దూరినారొ?

కుహనా నాయక వర్గం
వీధిని పడె తెలుగునాట
ఇది దొంగలమధ్య తెగని
పంపకాల కీచులాట.

అవినీతికి ఆట పట్టు
లని ధర్మము ఘోష వెటు
కీచకులకు నిలువనీడ
నిస్తావా? తెలుగువాడ!

వీరి నోట వినిపించే
విప్లవోద్యమ పరిభాష
ఎరువు తెచ్చుకొన్న భాష
పిశాచాల వేదఘోష.

తెలుగుగడ్డ పగులగొట్టి
గద్దెలెక్క దలచువట్టి
తోడేళ్లను జేరనీకు
పై పూతకు మోసపోకు.

ఈ పీకులు పదవి కొరకు
మహనాయకుల బలిపెట్టుట
పిల్లిచేత కోతి వేడి
జీడి గింజ లేరించుట.

డేళ్లు పంచుకోదలచిన
గజదొంగల ఆటకట్టు
తెలుగునేల మీ తాతల
సొమ్మా? యని గడ్డిపెట్టు.

శిశిర



నీలం పట్టుచీరెకి ఎర్రజరీ పమిట కొంగులా వున్న పడమటి ఆకాశాన్ని చూస్తూ పిట్టగోడని ఆనుకుని నిలబడింది భానుమతి.

సాయంత్రం అందంగా వుంది. అందంలో విషాదం వుంది. వియోగంనుంచి జనించే విషాదం అది.

కాంపౌండ్‌లో కారు ఆగడం విని క్రిందికి చూసింది. సరస్వతి దిగుతోంది. వెనక ఆమె భర్త వెంకట్రావు. వాళ్ళు దగ్గర బంధువులే—ఎప్పుడైనా వస్తూనే వుంటారు.

[illegible] వచ్చి వాళ్ళని పలకరించి కూర్చోబెట్టింది. మధ్యలో పెద్ద [illegible] చుట్టూ స్తంభాలకి ఆనుకుని కుర్చీలున్నాయి. ఆ స్తంభాలకే అల్లుకున్న తీగెలు పూసినపువ్వులు సన్నని పరిమళం వెదజల్లుతున్నాయి. ఆ పరిమళం ఆహ్లాదకరంగా వుంటూనే విషాదాన్ని మోసుకొస్తున్నది—అవును—అక్కడవున్న నాలుగు కుర్చీల్లో ఒకటి ఖాళీగా వున్నది కదా మరి!!

తలవంచుకుని కూర్చుని కప్పుల్లో కాఫీ పోసి వాళ్ళముందుకి నెట్టింది భానుమతి.

'రేపు మా మహిళామండలిలో, బీహార్ క్షామ బాధితుల సహాయార్థం ఒక వెరైటీ ప్రోగ్రాం ఏర్పాటు చేస్తున్నాం—నువ్వు టికెట్ తీసుకోవాలి—తీసుకోడమే కాదు—తప్పనిసరిగా రావాలి—' అన్నది సరస్వతి ఉత్సాహంగా.

'దిగులుల్లా నిలవవుంటే మెదడు కుళ్ళి పోతుంది. జీవితం నరకం అవుతుంది—విధి లిఖితాన్ని తప్పించేవారు లేరనే సంగతి నీకు తెలును కదా! రెండువంతుల జీవితం ముందే వున్నది. జీవితాన్ని అనుభవించడం, హాయిగా బ్రతకడం, మనకున్న పరిధిలో ఇతరులని సంతోషపెడుతూ మనం సుఖపడడం అవసరం అంటాను—' అన్నాడు వెంకట్రావు, కొంచెం ఆవేశంగా.

భానుమతి ఏమీ అనలేదు. పూర్వం ఇలాంటి ఓదార్పు వాక్యాలు విన్నప్పుడు అప్రయత్నంగా కంట నీరు తిరిగేది. ఇప్పుడు హృదయంలో కన్నీరు ఇంకిపోయి వుండవచ్చునేమో! అందుకే శుష్కహాసం చేసి వూరుకుంది.

'తప్పకుండా రావాలి' అన్నది సరస్వతి మళ్ళీ టికెట్టుయిచ్చి.

'వస్తాను' అంతకు మించి ఏమీ అనలేదు. వాళ్ళు వెళ్ళారు. వంటావిడ ఇంట్లో దీపాలు వెలిగించింది.

'వచ్చినవాళ్ళు భోజనానికి వుంటారా?' అనడిగింది.

'వాళ్ళు వెళ్ళారు' అన్నది ముక్తసరిగా యజమానురాలు.

'అయ్యగారుండగా ఈయన్ని భోజనం చేయంది పోనిచ్చేవారే కాదు. ఎంత బంధుప్రీతి ఆయనకి! ఇంకా ఈ కుర్చీల్లో కూర్చుని మీరు నలుగురూ పేక ఆడు

ఉన్నట్లుండి పురుటురని నా కళ్ళకి! మూడు దారి మోటారు సైకిలు వద్దంటే విన్నారు కాదు.'

సంవత్సరంనుంచి వెంకాయమ్మగారు పోతం అప్పగించని రోజు లేదు.

విసుగ్గా లేచి ఇంట్లోకి వెళ్ళింది భాను మతి—ఇల్లు మహా విసుగు...

ఎక్కడికి వెళ్ళాలి! ఏంచెయ్యాలి!

వెయ్యి మైళ్ళదూరానవుండి, పొట్ట కూటికోసం ఉద్యోగం చేసుకుంటూ, నలుగురు పిల్లల్ని సాకలేక సతమతమై పోతూన్న అన్నయ్యదగ్గరకా?

పుత్రశోకంతో మంచం ఎక్కి క్షణ క్షణం మృత్యువును ఆహ్వానిస్తూన్న అత్తగారిదగ్గరకా? ఇంకా ఎవరున్నారు బంధువులు?

'మీరూ ఇక్కడికి రాకూడదూ?' అని అత్తగారిని బ్రతిమిలాడింది.

'పసుపుకుంకుమలు కరువైన నీముఖం చూస్తూ నేను బ్రతకలేనే తల్లీ. నా గుండె పగిలి పోతుంది. నేను రాలేను' అనే సింది ఆవిడ.

'ఎంతకాలం ఈ అజ్ఞాతవాసం?' అని మనస్సు ఎదురు తిరిగి ప్రశ్నించని రోజు లేదు—

సూర్యరశ్మి సోకనీయని బ్రతుకు మహా లోతగా వుంది...

రెండురోజులు గడిచాక మళ్ళీ సరస్వతి వచ్చింది.

'మా క్లబ్బులో భరతనాట్యం చేస్తా నన్నావిడకి జ్వరం వచ్చింది. బహుశా టైఫాయిడ్ అవుతుందేమో! ఆ సమయంలో నువ్వు వీణ వాయించకూడదూ?' అని అడిగింది.

ఆశ్చర్యంగా కళ్ళు వెడల్పు చేసుకుని చూసింది భానుమతి.

'నేను కచేరీలు చేయడం నువ్వెరుగుదువా?' అనే ప్రశ్న వుంది ఆమె కళ్ళల్లో.

'రేడియోలో వాయించే దానివిగా. అప్పుడంటే అన్నగారు ఒప్పుకోలేదనుకో! కచేరీలు చేయడానికి! అయినా, ప్లీజ్, నాకోసం ఈ ఒక్క సాయం చేయాలి నువ్వు తప్పదు—ఒక్క అరగంట వాయిస్తే చాలు—' చేతులు పట్టుకుంది. 'ఊ' అని పించుకునే వెళ్ళింది.

[illegible] సరిచేసి శృతి చేసింది. వేళ్ళు జల్లుమన్నది.

'శ్రీరంగపుర విహార — జయకోదండ రామావతార' అనే కృతి వాయించింది.

అవును మర్చిపోలేదు.

కార్యక్రమం పూర్తయినాక చాలామంది అభినందించారు. క్లబ్బులో మెంబరు కావాలని అడిగారు. 'ఇన్నాళ్ళూ ఎక్కడికీ రాకుండా ఎందుకు వుండపోయారూ?' అని ఆశ్చర్యం ప్రకటించారు.

ఆ అభినందనల్లో వేడికి శరీరం పులకరించింది. మనస్సు ఉల్లాసం పుంజుకున్నది. చాలామంది తమ ఇంటికి రమ్మని పిలిచారు. జ్యోత్స్నాదేవి మరీ మరీ పిలిచింది. అనుపమాదేవి ఆదివారం 'టీ' రమ్మన్నది. అరవింద తనే వస్తానన్నది.

సరస్వతి తనకారులో లిఫ్టు యిచ్చింది.

ఇంటికివచ్చి అద్దంముందు నిలబడింది. ఆకు పచ్చరంగు కంచి పట్టుచీరె, నల్లటి జరీపువ్వుల పట్టు జాకెట్టు, చెవులకి రవ్వల దుద్దులు, మెడలో ముత్యాలదండ, హుందాగావున్న సిగ!! తను! తను ఈ రోజు ఎంత నాజూకుగా వున్నది!! నుదుటి పైన తిలకం వుంటె ఇంకా ఎంత శోభస్కరంగా వుంటుంది. అప్రయత్నంగా వణుకుతున్న వ్రేళ్ళతో నుదుట తిలకం దిద్దుకుంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఎదురుగా గోడకి వ్రేలాడుతూన్న కృష్ణమూర్తి ఫోటో అద్దంలో తన వెనకగా కనిపించింది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది.

'నన్ను క్షమించండి— నేనీ ఇంట్లో ఒంటరి జీవితం గడపలేను—నాకు జీవితం కావాలి—ఇలాంటి జీవితం కాదు—కొంచెం మెరుగైన జీవితం—వెలుగువున్న జీవితం'— అని చేతులు జోడించింది.

అతను వుండగా ఆ ఇల్లు బంధువులతో ఎప్పుడూ పెళ్ళివారి విడిదిలా వుండేది. అతనికెన్నో పనులు, తనకి యింట్లో బంధువులు — అతని భార్యగా, ఆ ఇంటి గృహిణిగా బాధ్యతలు నెరవేరుస్తూ గడపటమేగాని బయటి ప్రపంచ మెలాంటిదో పరిశీలించే అవకాశం రాలేదు—

'మహాలక్ష్మిలా వుండేదానివి—పాపం—' భోజనం వడ్డిస్తూ నిట్టూర్చింది వెంకా

యమ్మగారు

మనస్సు చివుక్కుమనకుండా వుండలేకపోయింది. ఎంత కాదన్నా తన రక్తంలో తరతరాలనుంచీ వస్తూన్న 'సంప్రదాయం' 'ఆచారం' అనే కణాలు లేకపోలేదు—అందువల్లనే నిండుముస్తాబు చేసుకుని వున్నప్పుడు ఏదో తప్పుచేసినట్లు అనిపించింది భానుమతికి. కానీ మరుక్షణంలోనే చదువువలన మనస్సులో మొలిచిన ఆధునిక భావాలు ఆ అనుభూతిని అణగద్రొక్కాయి.

'నేనేం తప్పు చేయడంలేదు—' అని తనని తానే సమర్థించుకుంది భానుమతి.

ఆదివారం అనుపమాదేవి ఇంటికి 'టీ'కి వెళ్ళింది భానుమతి.

చాలామంది ధనవంతుల ఇళ్ళలాగే వాళ్ళ ఇల్లూ ఖరీదైన సామాన్లతో నిండి వుంది. అనుపమాదేవి ప్రత్యేకమైన అభిరుచులేమీ తెలియజేయడం లేదు గృహాలంకరణ. ఆధునిక సమాజంలో మెలగడానికి కావాల్సిన హంగులున్నాయి.

కాఫీ టిఫినూ వంటావిడచేత చేయించి తెప్పించింది.

తింటూవుండగా, ఆరడుగులపైనే పొడవూ మల్లెపూవులాంటి శరీరం ఛాయా కలిగిన ముప్ఫైఏళ్ళ యువకుడు ఒకతను తెరవెనుక నిలబడడం గమనించింది భానుమతి.

'నువ్వా రఘూ. లోపలికి రావోయ్— ఫరవాలేదు! నా స్నేహితురాలే ఈవిడ—' అని పిలిచింది అనుపమాదేవి.

అతను వచ్చి మరో కుర్చీ ముందుకి జరుపుకుని కూర్చున్నాడు.

'ఇతను రఘుపతి, నా తమ్ముడు — చదువుమీద ఆసక్తికన్న బిజినెస్ అంటే ఎక్కువ ఇష్టం—ప్రస్తుతం నా దగ్గరే వుంటున్నాడు—' పరిచయం చేసింది.

మామూలుగా నమస్కారంచేసి వూరుకున్నది భానుమతి.

అతనేదో మాట్లాడాడు. మహిళా మండలి కార్యక్రమం తనూ చూశాడట. వీణావాదనం చాలా నచ్చిందట.

'థాంక్స్' అన్నది భానుమతి.

ఇంటికి బయలుదేరుతూండగా తన స్కూటర్‌మీద లిఫ్టు యిస్తానన్నాడతను. మొదట్లో ఆశ్చర్యపడినా తరువాత సర్దుకుని 'వద్దులెండి' అనగలిగింది భానుమతి.

ఇంటిక నడిచొచ్చేవడం అనకిష్టం. కాని తొక్కా ఎక్కాలి తప్పదు.

అప్పటికే ఎవరో పెదవులు చప్పరిస్తూ, 'రిచ్ యంగ్ విడో! పాపం' అన్నారు.

భానుమతికి మధ్యకాలం బాగానే నడిచి పోతున్నట్లుంది.

మందులషాపులో అమ్మకం చాలా బాగా వుందని చెప్పారు శివకామయ్యగారు. ఆయనే అన్నీ చూసుకుంటున్నారు. ఆయన కృష్ణమూర్తికి దూరపు బంధువు — పెద్ద కుటుంబం కలవాడు. ఆర్థికంగా పాయ పడాలనే వుద్దేశ్యంతో, తాను కొత్తగా పెట్టుకున్న మందులషాపు నిర్వహణ బాధ్యత ఆయనకి అప్పగించాడు కృష్ణమూర్తి. అదే భావంతో ఆయన జీతాన్ని హెచ్చు చేసింది భానుమతి 'తండ్రి లాంటి వారు' అంటూ.

ఆ రోజు సాయంత్రం అద్దం ముందు కూర్చుని తను కొత్తగా నేర్చుకున్న హెయిర్‌స్టయిల్ సాధన చేస్తోంది భానుమతి. తాను మరునాడు వెళ్లబోయే పేరంటం కోసం.

అప్పుడే వచ్చి గుమ్మందగ్గర నిలబడి ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తూనే 'అమ్మాయ్'—అని పిలిచారు శివకామయ్యగారు—

దువ్వెన డ్రెస్సింగ్ టేబిల్ మీదే వదిలి వెనక్కివచ్చి 'కూర్చోండి బాబాయిగారూ!' అన్నది భానుమతి—

## నిధి చాలా సుఖమూ?

'మా పెద్దమ్మాయి భర్త పోయాడనే వార్త చెప్తే వుంటాను. దానికి రావల్సిన ఆస్తికి పేచీ లొచ్చినట్లు వుత్తరం వచ్చిందమ్మా— నేను వెళ్ళి అక్కడో నెల రోజులువుండి అధంతా సెటిల్ చేసి అమ్మాయినిక్కడికి తీసుకు రావాలను కుంటున్నానమ్మా! మరి ఈ నెలరోజులూ షాపు మూసివేస్తే మనకి చాలా నష్టం—' అన్నారాయన సందేహిస్తూ!

'పోనీ మీకు నమ్మకస్థులైనవారి నెవరి నైనా వుంచి వెళ్ళండి—'

'అదే ఆలోచించానమ్మా—నీ కెవరైనా తెలిస్తే — పోనీ మీ బంధువులెవరైనా వుంటే చెప్పు—'

'నాకెవరున్నారు బాబాయ్—పోనీ నేనే వెళ్ళి కూర్చోనా ఏం?' అని నవ్వింది భానుమతి.

వాకిట్లో ఆగింది అనుపమాదేవి కారు —అనుపమాదేవి వెనక రఘుపతి కూడా వున్నాడు,

చాలా నీట్‌గా ముస్తాబయి వున్నాడు. ఇద్దరూ వరండాలో కుర్చీల్లో కూర్చున్నారు. శివకామయ్యగారి వెనక భానుమతి వచ్చింది.

'నే వెడతానమ్మాయ్—ఏ సంగతీ రేపు చెప్పుకుందాం—' అని వెళ్ళబోయారాయన.

'వుండండి బాబాయ్ కాఫీ తీసుకొని వెడుదురుగాని—' అని ఆయన్ని కూర్చోపెట్టి, 'ఈయన తండ్రిలాంటివారు— మా మెడికల్‌షాపు మూడేళ్ళుగా ఒక్క చేతిమీదుగా చూస్తున్నారు. పాపం ఓ నెల రోజులు ఎక్కడికో వెళ్ళవలసిన పని వచ్చింది—ఎవర్ని పెట్టి వెళ్ళాలా అని మథనపడుతున్నారు—' అన్నది భానుమతి.

కాఫీ తీసుకుని వెళ్ళారు శివకామయ్యగారు.

అనుపమాదేవి (పూర్వాశ్రమంలో అన్నపూర్ణమ్మగారుట!) చాలాసేపు కబుర్లు చెప్పింది. ఆమె ఎస్కార్ట్ రఘుపతి కూడా మాట్లాడాడు. చక్కగా మాట్లాడే నేర్పుంది. మాట్లాడేటప్పుడు అతని చెంపలు ఆకుపచ్చగా లేత తమలపాకులంత సున్నితంగా వుండడం గమనించింది భానుమతి.

'నాకూ ఏదైనా బిజినెస్ చేయాలనుంది. ముందు కొంచెం అనుభవం వుండాలిగదా! మీ మందుల షాపులో నన్ను వుంచుకో కూడదూ! జీతం ఏమీ అక్కర్లేదు. పని నేర్చుకోడానికి!' అన్నాడతను వెళ్లబోతూ.

'మంచి ఐడియా తమ్ముడూ! తప్పకుండా వుంచుకోండి. కొంచెం వాళ్ళేనా వొంగుతుంది' అన్నది అనుపమాదేవి.

భానుమతి ఏమీ సమాధానం చెప్పలేదు. రాత్రి భోజనంచేస్తూ అనుకుంది 'ఏమైతేనేం! తెలిసినవాడేకదా! పైగా స్నేహపాత్రుడుకూడానూ!' అని.

మరునాడు సాయంత్రం రఘుపతిని తీసుకువెళ్ళి షాపు చూపించి స్టాక్‌లిస్ట్ యిచ్చి, కొన్ని సలహాలూ తాళం చెవులూ యిచ్చి 'ఆమె మంచివారు—ఆమెని మోసం చేయడం మనకి న్యాయంకాదు. నేనేస్థితిలో ఈ షాపు అప్పగించానో అలాగే మీరు నాకు తిరిగి అప్పగించాలి. ప్రతిరోజూ రాత్రి తాళం చెవులు తీసుకుని వెళ్ళి అమ్మాయి కివ్వాలి. ఆరోజు అమ్మకం ఎంతో చెప్పాలి. క్యాష్ హాండోవర్ చెయ్యాలి. ఏ మందులు తెప్పించడానికైనా ఆవిడ సంతకం లేనిదే వీల్లేదు' అన్నారు శివకామయ్యగారు.

* * *

సాయంత్రానికి వీడ్కోలు యివ్వడానికి రాత్రి వస్తోంది. ఇంట్లో దీపాలన్నీ వెలి



దగ్గు, జలుబులు నీర్సమును కలిగిస్తాయి — యితర వ్యాధులకు దారితీస్తాయి.

# బలము మరియు ఆరోగ్యమునకు వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి

దగ్గు, జలుబులతో రోగ నిరోధక శక్తిని గోల్పోతారు. మీరు నీర్సముగా వుంటారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశ మింటుంది. గనుక వాటర్‌బరీస్ కాంపౌండ్ క్రమంగా త్రాగండి. దీనిలోగల ఓషధులు ఆకలిని వృద్ధి పరుస్తాయి. కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి, యితర వ్యాధులు కలగకుండా రోగ నిరోధక శక్తిని యిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియోసోట్' మరియు 'గయోకోల్' దగ్గు, జలుబులనుండి ఉపశమనము కలిగిస్తాయి.




**వాటర్‌బరీస్ కాంపౌండ్ - అత్యంత నమ్మకమైన టానిక్**

వార్నర్-హిందుస్తాన్

గారి వెంకాయమ్మగారికి వంటకాలు పురమాయించి నవల చదువుకుంటూ వరండాలో కూర్చుంది భానుమతి.

'అమ్మగారూ ఇదిగో తాళం చెవులు' ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది. అదేం సంబోధన? రఘుపతి తాళంచెవులు టీపాయ్‌మీద పెట్టి నవ్వుతూ నిలబడ్డాడు.

'ఓ! మీరా! కూర్చోండి అదేమిటలా పిలిచారు?'

'ఇంకేమననూ? అమ్మాయిగారూ? అనేదా'?

'ఎంత చతురులండీ మీరు! అన్నట్లు ఇవాళ అప్పుడే షాపు మూసేశారేం?'

'తల నొప్పిగా వుందని — రేపటినుంచి తొమ్మిది గంటల దాకా తీసే వుంచుతాను లెండి—'

'దానికేం లెండి-కాఫీ త్రాగి వెళ్ళండి తల నొప్పి తగ్గుతుంది—'

రఘుపతి కుర్చీలో కూర్చున్నాడు అతని దగ్గర సన్నని సెంటువాసన గాలిలో తేలి వస్తోంది. నాజూకైన వాసన!

'రేపూ...' అనేసి ఏదో చెప్పబోయి ఆగిపోయాడు.

'చెప్పండి—

'నేనూ అక్కా సెకండ్ షోకి వెళ్ళాలనుకున్నాం— భానుమతి పిక్చర్లంటే నాకు చాలా యిష్టం. ఆ పేరులోనే ఏదో

## నిధి చాలా సుఖమా?

ఆకర్షణ వుంది—'

భానుమతి తల ఎత్తి అతని వంక వింతగా చూసింది. ఏమీ అనలేకపోయింది.

'మీరూ రాకూడదూ? అక్క అడగమంది—'

'అలాగే—' ఆ మాట అన్న తర్వాత తనే ఆశ్చర్యపోయింది. తిరిగి వెనక్కి తీసుకునే వీలులేదు.

'నేను వెడతానండీ—'

'మంచిది.'

అతను వెళ్ళిపోయాడు.

వెళ్ళిన వైపే చూస్తూ కూర్చుంది భానుమతి.

అతని తెల్లని ముఖం ఆకుపచ్చని సిడలు లేలే చెంపలు. పొడుగ్గా బలంగా వుండే వ్రేళ్ళూ, అన్నీ కళ్ళముందు కదులుతున్నాయి.

చదువుతూన్న నవల విసుగనిపించింది.

భోజనం సహించలేదు — మెదడులో కలవరం—హృదయంలో బరువు—మనస్సు పొగులు ముసిరిన దీపంలా తయారైంది.

నిద్ర పట్టని రాత్రి ఆలస్యంగా తెల్లవారింది. తొమ్మిది గంటలకే తాళం చెవుల కోసం వచ్చాడు రఘుపతి...

'కూర్చోండి — వెడుదురుగాని' అన్నది భానుమతి.

'టిఫిన్ పెట్టి పంపడానికా? మీ ఆతిధ్యానికో నమస్కారం బాబోయ్! నా డైజెషన్ చెడగొట్టకండి—' అంటూనే కూర్చున్నాడు.

సినిమా చూస్తూన్నంతసేపూ అతనేదో మాట్లాడుతూనే వున్నాడు. అనుపమాదేవి నవ్వుతోంది. చాలా అమాయకంగా వుండే మనిషి.

ధియేటర్‌కి ఆవిడ ఇల్లు చాలా దగ్గర. తను అక్కడ దిగిపోతూ తమ్ముడిని భానుమతి ఇంటివరకూ పంపింది ఆవిడ.

* * *

'రోజూ తాళం చెవులు అప్పగించడానికి వచ్చే అతన్ని మీరు భోజనం చేయమని బలవంత పెట్టడం నాకేం నచ్చలేదమ్మాయ్‌గారూ—మీరేమైనా అనుకోండి.' అన్నది వెంకాయమ్మగారు ఆ రోజు రాత్రి వంటఇల్లు సర్దుకునివచ్చి భానుమతి ప్రక్కన కూర్చుని — ఆరోజే శివరామయ్యగారి దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది. కూతురు పరిస్థితి బావుండలేదనీ, ఆమె సంసారం కుదుటపడి ఒక కొలిక్కి రావడానికి ఇంకా నెలరోజులు వ్యవధి కావాలనీ అంతవరకూ తాను రాలేననీ! ఆ విషయం ఆలోచిస్తూ సోఫాకి చేరగిలబడిన భానుమతి వులిక్కిపడి, 'ఏమిటీ? మీరనేది?' అన్నది.

'ఏం లేదమ్మాయ్‌గారూ, ఆ రఘుపతిగారికి రోజూ మన ఇంట భోజనం దేనికి చెప్పండి!'

'అదా! ఫరవాలేదు లెండి! ఏదో స్నేహపాత్రుడు. నాకుమాత్రం కంపెనీ ఏం వుంది' ప్రతి విషయాన్ని పచ్చుతెర వేసుకుని చూడకూడదు' అన్నది.

'నాదేం వుందమ్మా — నోరూరుకోక అన్నాను — మొన్నమధ్య మీ రింట్లో లేనప్పుడు మీ కోసం సరస్వతిగారూ, ఇంకా ఎవరో ఇద్దరు ఆడవాళ్ళొ వచ్చారు. వాళ్ళంతా మీ ఇద్దర్నిగురించే మాట్లాడుకున్నా రమ్మాయ్‌గారూ — అందుకని అన్నాను-' వెంకాయమ్మగారు నొచ్చుకుంది. వాళ్ళేమి మాట్లాడుకుని వుంటారో వూహించలేనంత తెలివి తక్కువదేం కాదు తను — ఒక్కొక్క సంఘటనను, ఒక్కొక్కమాటా తమకి తోచినవిధంగా, తమ మన



న్నుకి నచ్చిన విధంగా మలచుకుని నగిషీలు చెక్కుకుని తమకుతాము చెప్పుకుని, పది మందితోచెప్పి సంతోషిస్తూ వుండడం సహజ లక్షణం చాలామందికి. ఎంత నాజూకూ, సంస్కారం అనే మేలిముసుగులు ధరించి విద్యాధికురాండ్రుగా, సంస్కారవంతులుగా చెలామణి అవుతూన్నా ఈ సహజగుణం అప్పుడప్పుడూ తలయెత్తి చూసి మళ్లీ దాక్కుంటూనే వుంటుంది చాలామందిలో.

'స్నేహానికి ఆడ, మగ తేడాలు అంట గట్టడం సభ్యతా?' అని వాళ్ళని అడగ గలిగితే ఎంత బావుండును?' అనుకుంది భానుమతి. కానీ, వెంటనే ఆమెలోని మరొకవ్యక్తి ఎగతాళిగా నవ్వుతూ, 'నిజం చెప్పు—నువ్వు రఘుపతిని కేవలం స్నేహితుడుగా, శ్రేయోభిలాషిగా మాత్రమే చూడ గలుగుతున్నావా? అంతక్రమించిన భావాలేమీ నీలో కలగడం లేదా?' అని ప్రశ్నించింది.

నిజం ఆలోచిస్తే ఆ ప్రశ్నకి 'లేదు' అని జవాబు చెప్పే ధైర్యం ఆమెకి లేదు—పైగా తనని తానే 'నేను యౌవనవతినైన స్త్రీని—ముప్పై నిండని ముగ్ధను—సన్యాసినిని కాను — కావాలనే సంకల్పం, దీక్ష లేవు—నా హృదయంలో; ఆకర్షణీయంగా వుంటూ రోజురోజుకూ సన్నిహితుడౌతున్న ఒక యువకుడిపట్ల మరోభావం కలగడం తప్పా?' అనే ప్రశ్న వేసుకుంది ఆమె.

'అయితే అతన్ని వివాహం చేసుకుంటావా?' అని ఎవరైనా ప్రశ్నిస్తే ఏం సమాధానం చెప్పాలి?

ఏం చెప్పాలి?

ఇది తరగని ప్రశ్న!

శృతి తప్పకుండా గడియారం చేస్తున్న చప్పుడులో అదే ప్రశ్న—చీకటి రాత్రిలో గొంతు చించుకుని కీచురాళ్లు చేసే రోదన ధ్వనిలో అదే ప్రశ్న—ప్రక్కింటి పసిపాప ఏడుపులో సహితం అదే ప్రశ్న!

ఈ సంఘర్షణ భరించే శక్తి తనకి లేదు—ఈ సమస్యకి పరిష్కారం చేయందే తను బ్రతకలేదు.

రేపు అతడినే అడగాలి. ఏమని?

ఓ! రేపు ఆదివారం కదూ?

అయితేనేం! తనే వెళ్ళి అడగవచ్చు—

వెచ్చని కాంతిలో ఉదయకిరణాలు కిటికీలో నుంచి చొచ్చుకుని వచ్చాయి. వెంటా

యమ్మగారు కలుపుతూన్న కాఫీ ఫ్లేవర్ గాలిలో తేలి వస్తోంది.

ఆనందంగా తెల్లవారడం అంటే అదే కాబోలు!

స్నానంచేసి బీరువాదగ్గరకొస్తే ఏ చీర కట్టుకోవాలో తెలియకపోయింది. లేత గులాబిరంగు బెనారస్ చీరె అంటే చాలా యిష్టం. దానిమీద ముదురు ఆకుపచ్చ జాకెట్టు వేసుకుంటే అప్పుడే విడిచిన గులాబి మొగ్గలా వుంటుంది తన లావణ్యం. ముస్తాబు పూర్తయ్యేసరికి పది గంటలైంది.

'ఇదిగో వెంకమ్మగారూ! ఇవాళ మనింటికి ఇద్దరు అతిథులు వస్తారు భోజనంలోకి స్వీట్ ఏదైనా చేయండి. గులాబ్‌జాం చేయగలిగితే నయమే—'. అని పురమాయించి బైటపడింది.

క్రమం తప్పకుండా సాగిన నడక

## నిధి చాలా సుఖమా?

అనుపమాదేవి ఇంటి పెట్ల చివరి ఆగి పోయింది.

లోపలినుంచి వాగ్వాదం.

సందేహాస్పదంగా పాదాలు ఆగిపోయాయి.

'నువ్వెంతైనా చెప్పు—నాకే మాత్రం యిష్టంలేదు—ఇది మన సంప్రదాయానికి విరుద్ధం. ఈ మాట వింటే అమ్మ గుండె పగిలిపోతుంది.'

అనుపమాదేవి కంఠంలో ఆవేశమే కాదు. ఆగ్రహంకూడా వున్నది—

'కావల్సినంత ఆస్తి—మనం తపస్సు చేసినా సంపాదించలేం — నేనేమైనాసరె ఆవిడ్ని విడిచిపెట్టను — పెళ్ళిచేసుకు తీర్తాను—'

రఘుపతిలో పట్టుదల—

'నిక్షేపంగా నాలుగువేల కట్నంతో వచ్చిన ఒంగోలు సంబంధం చేసుకుని సంసారం చక్కపెట్టుకో రఘూ—కూడని పన్లు చెయ్యకు—' అర్థింపు—

'నాలుగువేలు ఏ మూలకి అక్కయ్యా! నా జన్మంతా దాంతోనే గడుస్తుందా? పెళ్ళాం పిల్లలూ ఏం పెట్టుకుని తింటారు తరువాత!

అలాంటి రొంపిలో ఇరుక్కోడం నా కిష్టంలేదు ఈమెని చేసుకుంటే విధవా వివాహం చేసుకున్న కీర్తి, కావాల్సినంత ఆస్తి రెండూ దక్కుతాయి — డిగ్రీలూ, పొలాలు లేనివాణ్ణి కదా అని నన్నింత తెలివి తక్కువవాడిగా జమకట్టకు—' నవ్వాడు రఘుపతి. ఆ నవ్వులో ఎన్నెన్నో సౌధాలు విరిగిపడి, ఎంతోమంది చేస్తూన్న హాహాకారాలు వినిపిస్తున్నాయి. చెవులు గింగురుమంటూన్నాయి. కళ్ళు తెరచుకుని వున్నా చుట్టూ చీకటి—చిమ్మచీకటి.

వెనక్కి తిరిగి, గేటుదాటి మరెన్నడూ ఆ ఇంటికి తిరిగి రాకుండా నిశ్చయించిన ఆ వ్యక్తిని అక్కా తమ్ముళ్ళిద్దరూ చూడనే లేదు.

మరునాడు ఉదయం తాళం చెవుల కోసం వచ్చిన రఘుపతికి వెంకాయమ్మ గారిలా చెప్పారు.

'అమ్మాయి రాత్రి అత్తగారి వూరు వెళ్ళింది. షాపు ఓనెల మూసివుంచినా ఫరవాలేదు అని చెప్పమన్నారు. ఎప్పుడు వస్తారో నాకు చెప్పలేదు' అని.

* * *

'ఈ పిల్లలెవరు భానుమతిగారూ!' అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది జ్యోత్స్నదేవి ఆరోజు సాయంత్రం భానుమతిని చూడడానికివచ్చి...

'పిల్లలు వూ శివకామయ్యగారి మనుమరాళ్ళు. తండ్రిపోయారు. వున్న కొంచెం ఆస్తి చిక్కుల్లోపడిపోయింది. తల్లి మంచం ఎక్కింది. చక్కని చుక్కలు. నేను పెంచుకుంటున్నాను. నా ఆస్తి సద్వినియోగం చేయాలనే తలంపుతో!' అని చెప్పింది భానుమతి ●






'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' అని చెప్పబడి ఉన్నందున శివ, కేశవులకు భేదమనేది లేదు. శైవులు హరుణ్ణి పూజించినా, విష్ణుభక్తులు హరిని పూజించినా— ఆ పూజలు అభిన్న మూర్తికే చెందుతాయి.

అయితే వారి ప్రవృత్తిలోనూ అలంకరణాదుల్లోనూ భేదం వున్నది. హరి రక్షకుడయితే, హరుడు నశింపజేస్తాడు. విష్ణువు పీతాంబరాన్ని ధరిస్తే శివుడు పులితోలు కట్టుకుంటాడు. నారాయణుడు మణిమయ కిరీటాన్ని ధరిస్తే, శంకరుడు గంగను తలపై పెట్టుకుంటాడు; విష్ణువు పరిమళిస్తున్న చందనాన్ని పూసుకుంటె శివుడు శరీరం నిండా బూడిద పులుముకుంటాడు. ఒకరు విలువైన హారాలు ధరిస్తే మరొకరు పాములను మెడలో వేసుకుంటారు. హరి దివ్యభవనంలో నివసిస్తే, హరుడు శ్మశానంలో ఉంటాడు. విష్ణువు దివ్యములైన సుదార్థాలను ఆరగిస్తే శివుడు హాలాహలాన్ని మింగుతాడు.

ఇలాటి వ్యత్యాసం ఎందుకేర్పడింది? అనే సందేహం సామాన్యంగా అందరికీ కలగవచ్చును.

ప్రతి ప్రాణికిన్నీ జన్మ, జరా, మరణాలు సహజాలు! వాటిని తప్పించుకోవడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఏ దేవుడు పుట్టించి, కాపాడుతాడో అతడే అంత మొందిస్తాడని తెలిసినవాళ్ళు అనుకుంటారు. ఆయన ఒక రూపంలో రక్షించి మరొక రూపంలో అంత మొందిస్తాడన్నమాట!

హరిహరుల విభిన్న ప్రవృత్తులను బట్టి, అలంకారాలనూ, అలవాట్లను బట్టి మనం ముఖ్యమైన ఒక విషయాన్ని గమనించవలసి వున్నది. మనకు కష్టాలు వచ్చినా, సుఖాలు కలిగినా— ఎట్టి అవస్థలోనూ మనస్సును నిర్లిప్తంగా ఉంచుకోవాలి. సుఖదుఃఖాలను సమానంగానే చూడాలి. కష్టం కలిగితే దుఃఖించడం, సుఖం కలిగితే సంతోషించడం కూడదు. ఏది వచ్చినా, ఎట్టి మనోవికారమూ లేకుండానే వుండాలి. అలా వున్నప్పుడే మనం లౌకికాలతో ఎక్కువ సంబంధం పెట్టుకోక, భగవంతుణ్ణి నిర్మలమైన భక్తితో ధ్యానించడానికి అవకాశం వుంటుంది. ఈ పద్ధతిని అందరూ అనుసరించాలనే సంకల్పంతోనే అభిన్నులైన హరి హరుల ప్రవృత్తి మున్నుగునవి విభిన్నాలుగా ఏర్పడ్డాయి.

ఈ తత్త్వాన్ని తెలుసుకున్న ఒక పరమభక్తుడు ఈ విధంగా వివరించాడు—

'అహౌవాహారే — వా
కుసుమశయనే వా దృషది వా
మణౌవా లోష్ఠేవా
బలవతి రిపేవా సుహృది వా!
తృణే వా స్త్రైణే వా
మమ సమదృశో యాంతు దివసాః
క్వచిత్ పుణ్యేఽరణ్యే
శివ శివ శివేతి ప్రలపతః.'

'పామును చూసినా, పూలమాలను చూసినా సమభావమనే భావన ఉండాలి. పూలపాన్పుకీ, పాషాణానికి శయనంలో భేదం చూపకూడదు. విలువైన మణినీ, గులకరాయినలెనే చూడాలి. బలవంతుడైన శత్రువునూ, మిత్రునీ సమానంగా భావించాలి. అందకత్తెలయిన స్త్రీలను తృణప్రాయంగా చూడవలెను. ఈ విధంగా సమాన దృష్టి కలిగి, ఒకానొక పవిత్రమైన అరణ్యంలో నివసిస్తూ 'శివ — శివ — శివ' అని ధ్యానం చేస్తూ రోజులు గడిపితే చాలు; అంతకంటే కావలసినది మరేదీ లేదు' అని దీని అభిప్రాయం.






### జ రి గి న క థ

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాథంగారు ఆ కుటుంబానికి ఆప్తుడు. ముకుందానికి పెళ్ళి అవుతుంది. విశ్వనాథంగారు చనిపోవడంతో ఆయన కొడుకులు అప్పు తీర్చమని తొందరపెడతారు. సుందరానికి గొప్పింటి సంబంధం కలిసివస్తుంది. అతనికి రమణితో అట్టహాసంగా పెళ్ళవుతుంది. ప్రకాశాన్ని సుందరం దగ్గరుంచి మెడిసిన్ చదివించాలని యింట్లోవాళ్ళ అభిలాష. శకుంతల భర్త మోహన్ వుద్యోగం పోతుంది. ముకుందం అతనికి డబ్బు పంపిస్తాడు.

---

## 9

'రేపు ప్రొద్దుట అటు వెళ్ళినప్పుడు కాలేజీనుంచి నాకో అప్లికేషన్ ఫారం తెచ్చిపెడుదూ' — ఎక్కడికో వెళ్ళటానికి ముస్తాబయి జోళ్ళువేసుకుంటున్న ప్రకాశం చెల్లెలు తనతో ఏదో చెప్తోందనిపించి, 'ఎందుకూ' అన్నాడు.

'ఎందుకేమిటి ? నేను కాలేజీలో చేరటానికి.'

అక్కడేవున్న సుభద్రమ్మగారూ ముకుందం, శశి మాటలు వింటూ మొహాలు చూసుకున్నారు.

వారంరోజుల క్రిందటే స్కూలు ఫైనల్ రిజల్ట్సు వచ్చాయి—శశి ప్యాసయింది—అంతా సంతోషించారు— పెద్ద కూతురు మధ్యలోనే ఫేలవటం ఆ తరువాత ఇంక స్కూలుకి వెళ్ళనని మొండికేసి కూర్చోటం అంతా గుర్తుతెచ్చుకుంటూ, 'పోన్లే స్కూల్లో జేర్పించినందుకు నువ్వయినా మాట దక్కించావు' అంది సుభద్రమ్మగారు తృప్తిగా.

అక్కడితో ఆ పిల్ల చదువు ప్రసక్తి ముగిసిందనే అందరూ అనుకున్నారు— కాని శశి అలా అనుకోలేదు — అయినా ఆమాట పైకి తేల్చి చెప్పలేదు ఇవాళ్టివరకూ— అందుకే కొంచెం ఆశ్చర్యంగాను చిత్రంగాను వినిపించిందావార్త అందరికీ— అందరూ ఒకరినొకరు పరికించుకుంటూ మౌనంగా వుండిపోయేసరికి శశి వెళ్ళి ముకుందం కుర్చీదగ్గరగా నిలబడి, 'ఏమన్నయ్యా నేను చదువుకుంటాను— నీకిష్టంలేదా' అంది.

'అమ్మ ఇష్టపడితే నా అభ్యంతరం ఏమీలేదు' అన్నాడతను. తమ కుటుంబాలలో ఆడ పిల్లలు ఇంతవరకూ కాలేజీలలో చదవలేదుకాని చాలామంది చెప్పిస్తూనే వున్నారు. ఉన్న వూళ్ళో కాలేజీ లేకపోతే మరో వూరుపంపి హాస్టల్సులో కూడ వుంచి చదివిస్తున్నారు — తమకా బాధ లేదు — నిక్షేపంలా వూళ్ళో కాలేజీలోనే చదువుకోవచ్చు—పైగా శకుంతలలా కాదు; శశికి చదువులో శ్రద్ధ సరదాకూడ వుంది— అయినా అమ్మ ఏమంటుందో? ఎంత చదివించినా చివరికో అయ్యచేతిలో పెట్టక తప్పదు కదా — అయినా పదహారేళ్ళ వచ్చిన పిల్లకి ఇంకనైనా పెళ్ళి ప్రయత్నాలు చెయ్యకుండా కాలేజీలూ చదువులూ అంటూ ఇంకా ఎన్నాళ్ళు జాప్యం చేస్తాం— ఎఫ్పేలూ బియ్యేలూ చదివిస్తే మాత్రం కట్నాలు గుమ్మరించకుండా పెళ్ళిళ్ళు కావు కదా— ఆమాత్రం దానికీ ఈ దండగకూడ ఎందుకు— కలిగినవాళ్ళు ఎన్నిరకాలుగా ఖర్చుపెట్టుకున్నా ఎన్ని సరదాలు తీర్చుకున్నా ఇబ్బందిలేదు — మనలాంటివాళ్ళం ఎలాగో అలా బాధ్యతలు తీర్చుకుని బయటపడాలి కాని — అని అంటుందేమో అనిపించిందతనికి.

కొద్దిరోజుల క్రితం అయితే సుభద్రమ్మగారి ఆలోచనలు అచ్చంగా అలాగే సాగేవి— కాని ఇప్పుడిప్పుడే ఆవిడలో కొద్దిగా మార్పు వస్తోంది — పైకి చెప్పదు కాని ఆవిడ ఆలోచనలు మరో రకంగా కూడ సాగుతున్నాయి — 'ఆడపిల్లని అత్తవారింటికి పంపించేస్తే బాధ్యత తీరిపోతుంది అన్నట్లు హడావిడి పడిపోయి పెద్ద కూతురికి పెళ్ళిచేసింది— అల్లుడు చదువుకున్నవాడు; నాలుగురాళ్ళు సంపాదించుకుంటున్నవాడూను, ఇంక తన బిడ్డకెలాంటి లోటు వుండదు— తను ఓనాడు పెట్టినా పెట్టకపోయినా వాళ్ళకి బాధ వుండదు అనుకుంది — కాని తమకి వున్నా ఇంకొకరి పెట్టుపోతలమీద ఆశపడే రకం వాళ్ళు ఆ వియ్యాలవారు — కొత్తలో ఏదో సర్దుకుపోతే తీరిపోతుంది, కొన్నాళ్ళకి వాళ్ళే మారతారు అనుకుంటున్న సమయంలో అల్లుడు తీరి కూర్చుని వుద్యోగంకూడ మానేశాడు — ఉండివుండీ డబ్బు కావాలని అతను పెళ్ళాంచేత ఇక్కడికి వుత్తరం వ్రాయించడం, ఆ డబ్బు పంపించకపోతే అమ్మాయిని వాళ్ళెంత ఆరళ్ళు పెడతారో అని తను అగ్గగ్గలాడిపోతూ కొడుకుచేత అప్పయినా చేయించి

డబ్బు పంపించటం అవిడకి చాలా విసుగ్గానూ బాధగానూకూడ వుంది. అవన్నీ చాలవన్నట్లు శకుంతలకి మళ్లీ నెల తప్పింది.

'ఇప్పుడు నేనేం పిల్లలకోసం బెంగపెట్టుకుని ఇదయిపోతున్నానా— దేవుడు నాలాంటివాళ్లకే అన్ని పరీక్షలు పెడతాడు కాబోలు— ఏదో మించిపోయినట్లు ఇదికూడ ఇప్పుడే సిద్ధం అవాలా — మూడో పురుడయినా మీరు తీసుకువెళ్లాల్సిందే అని మా అత్తగారు స్పష్టంగా చెప్పేసింది — అన్నయ్య మొహం చూడాలంటేనే నాకు ప్రాణం చచ్చిపోతోంది' అంటూ బోలెడు బాధపడిపోతూ పుత్తరం వ్రాసింది శకుంతల — ఎందులో ఏలోటు వచ్చినా సర్దుకుపోయే మనుష్యులు కూడ కాదు—ఆ వియ్యాలవారిని తలుచుకుంటూంటేనే సుభద్రమ్మగారి గుండెలు దడదడలాడుతాయి— అయినా ప్రపంచం అంతా అలాగే వుంటుందా—శశి అదృష్టం ఎలా వుందో—దేనికీ ఒకరిమీద ఆధారపడకుండా ఒకర్ని ఏవిధంగా బాధపెట్టకుండా వుండే మంచివాడే రాకూడదా దానికి అనిపించేది ఒక్కొక్కప్పుడు — ఏమో ఏం జరగబోతుందో — అయినా ఏమంత మించిపోయిందని ఇప్పటినుంచీ తొందరపడిపోవటం—చిన్నతనంలోనే బాధ్యతలూ బరువులూ దాని నెత్తిన పెట్టటం. ఏదైనా వస్తే దాంతోపాటు అందరూ బాధపడటం ఎందుకు — ఓ రెండుమూడేళ్లు గడిచినా గడిచినట్లే — ఆ చదువేదో చెప్పిస్తేనే తీరిపోతుంది' అనుకుంది— పైకిమాత్రం 'నాకేం తెలుస్తుంది — అన్నయ్యలు ఏలా చెప్తే అలా చెయ్యి' అంది.

తల్లి మాటలకి ముకుందం ప్రకాశం కొస్త విస్మయంగా మొహాలు చూసుకున్నారు.

అన్నయ్యలు ఒప్పుకున్నా అమ్మ ఇష్టపడదు ఏను ఏడ్చి రాగాలు పెట్టి పెద్ద గొడవ చేయాల్సివస్తుంది అనుకున్న శశి కూడ సందేహంగా తల్లి వంక చూసింది.

'ఏమో అనుకున్నాను — నువ్వు చాలా మారావమ్మా,' అన్నాడు ముకుందం.

'పది మందితోపాటు మనమూ పోవాలి కాని మనం ఒక్కళ్లం వెనకతరం ఆలోచనలు పెట్టుకుని కూర్చుంటామంటే అదేదో శాస్త్రం చెప్పినట్లే వుంటుంది— అయినా కాలేజీకి వెళ్లి చదువుకోవటంలో తప్పేమీ లేదనిపిస్తోంది నాక్కూడ — ఇక ఈ కాలం పెళ్లికొడుకులు కూడ పెద్ద చదువు చదివిన పిల్లే కావాలంటారేమో— బాగా చదివిస్తే కట్నాల బెడద అయినా లేకుండా పోతుందేమో,' అంది ఆపేక్షగా

గాలి మందరంగా హాయిగా గొల్పేలా వీస్తోంది—

రెండు రోజులక్రితం అతి భయానకంగా, నానా భీభత్సంగా తయారయి ప్రాణికోటి భయంతో అల్లల్లాడి పోయేలా చేసి ప్రకృతి ఇప్పుడు యథా స్థితిలో వుంది నంగనాచిలా—



కూతురి వంక చూస్తూ.

* * *

అరచేతిలో గడ్డం ఆనించుకుని చాలా సేపటి నుంచి అలా గదిలో కుర్చీలో కూర్చున్న ముకుందం నిరాశగా నిస్పృహగా నిట్టూరుస్తూ ఒక్కసారి కిటికిలోంచి అలా బయటికి చూశాడు.

ఆకాశం నిర్మలంగా వుంది—

మనిషి మనుగడకు నీరూ గాలీ అతి ముఖ్యమైనవే—అయితే అవి తగుపాళ్లలో వునికి కావలసినంత దొరికినప్పుడే హాయిగా ఆనందముగా వుంటుంది—వానలు లేకపోతే నేల ఓటలువారి పంటలుపండక దేశంలో కరువు కాటకాలు విలయతాండవం చేస్తాయి—తినటానికి తిండీ త్రాగటానికి నీరూ లేక మనుషులు మాడిపోతారు—

అలాగే అతివృష్టి, వరదలు, మహావృక్షాలని సహితం పెకలించివేసే పెనుగాలీకూడా ప్రాణికోటికి అంతులేని కష్టం నష్టం కలిగిస్తాయి.

ఒక్కరోజు తన ప్రతాపం చూపించటానికా అన్నట్లు విజృంభించి మళ్లీ యథాస్థితికి వచ్చేస్తుంది ప్రకృతి. కాని దాని ప్రభావం మాత్రం ఎన్నో రోజులు సంవత్సరాలు కూడ మనిషిమీద వుంటుంది—ఈ గాలివానవల్ల దేశం మొత్తంమీద పంటనష్టం ఇళ్లు కూలిపోవటం, పాకలు కొట్టుకుపోవటం. ప్రమాద పరిస్థితులలో చిక్కుకున్నవారు ప్రాణాలు అరచేత పెట్టుకుని సురక్షిత ప్రదేశాలకి పోవటం, అక్కడా అక్కడా ప్రాణనష్టం, దారీ తెన్నూ తెలియని స్థితిలో కొన్ని పశువులు కొట్టుకుపోవటం, కొన్నిటిని కట్టుకొయ్యనుంచి విప్పే అవకాశంకూడ లేక కూలిన పాకక్రిందే దారుణమైన చావుకి గురికావటం—అబ్బ—విన్న విన్న వార్తలని తలుచుకుంటూంటే, ఇప్పుడుకూడ వళ్లు జలదరిస్తోంది—దేశం మొత్తంమీద జరిగిన నష్టం కొన్ని లక్షల విలువ వుంటుందని ఇప్పటికి వేసిన అంచనా—అందులో నా వాటా రెండు మూడువేలపైనే వుంటుంది—ఈ సంవత్సరం ఒక్క గింజ ఇంటికి రాదు—ఇల్లుకూడ బాగుచేయించాలి—అసలు నాన్నగారు కొనేసరికే కాస్త పాత యిల్లు. ఈ ఇరవై ఏళ్లలో యింకా పాతబడిపోయింది—ఏదో ఈ గదులిమట్టుకైనా పైన డాబా వుంది. అదీ అదృష్టం—వంటగది, స్టోరుగది ముందు వరండా అంతా పెంకునేత—వాన వచ్చినప్పుడల్లా ఆ భాగం కురవటం కాస్త ఇబ్బంది పడటం, మళ్లీ వర్షాకాలంనాటికయినా బాగు చేయించుకోవాలి అనుకోవటం పరిపాటయిపోయింది కాని పనిచేయించటం మాత్రం జరగలేదు—ఇంక ఈ వానకైతే అసలు ఆ భాగంలో కాలు పెట్టలేనట్లుగా తయారయింది—కురుస్తున్న భాగాలక్రింద గిన్నెలూ అవీ పెట్టి కాస్సేపు కాలక్షేపం చేశారు. ఇంక తరువాత కురిసిన వాన అంతా ఇంట్లోకే వచ్చేసరికి అందులో సామానులూ, అవకాయజాడీలూ అవీ అప్పటికప్పుడు తెచ్చుకుని గదుల్లో సర్దుకోవలసివచ్చింది—

## ఆశలూ అనుభవాలూ

ఏ క్షణంలో అయినా ఆ కప్పు కూలి మీదపడుతుందేమో అనిపించింది—అంత ప్రమాదం మాత్రం జరగకుండా తప్పింది కాని వెంటనే అది బాగుచేయించకపోతే మాత్రం లాభంలేదు—పెరటిలో కొబ్బరిచెట్టు ఒకటి కూలి అటు గోడమీదపడి గోడ కాస్త మేర కూలింది—అదొకటి వెంటనే కట్టించాలి—అబ్బబ్బ—తలుచుకుంటూంటేనే మతి పోతోంది—చేతికందిన తమ్ముడు వున్నాడూ అంటే వాడు వెళ్లి అక్కడెక్కడో కూర్చున్నాడు. వాడు ఎప్పటికి తిరిగి వస్తాడు. ఎప్పటికి ఈ ఇంటి బాధ్యతలో చెయ్యి ఆసరా ఇస్తాడు—ఇంక ఈ ప్రకాశం చదువు ఎప్పటికి పూర్తవుతుందో—అన్నీ ఒక్కడినీ చూసుకోలేక ఇదయిపోతున్నాను.' అనుకున్నాడు దిగులుగా నుదురు పట్టుకుంటూ.

ఎందుకో ఆ గదిలోకి వచ్చిన యశోద భర్త వైఖరి చూస్తూ వచ్చిన పని మరిచిపోయి అలాగే నిలబడిపోయింది కాస్సేపు. తరువాత మెల్లిగా అంది 'మీరు అస్తమానూ ఇదే ఆలోచిస్తూ కూర్చుంటే ఎలా, మీ వైఖరి చూసి అత్తయ్య మరీ బెంగపెట్టుకుంటున్నారు—ఏం చేస్తాం.'

'తలుచుకుంటూంటే భయం వేస్తోంది—ఇవన్నీ ఎలా సవరించుకు రావాలో తోచకుండా వుంది.'

'నిజమే—మా కందరికీకూడ ఎంతో బాధగానే వుంది—ఏదో ఏర్పాటు చేసుకోవాలి కానీ మరీ కృంగిపోయి బెంగపెట్టుకుంటే ఎలా? అయినా—ఇది మన ఒక్కరికీవచ్చిన ఇబ్బంది కాదు—ఉన్న కొంప గోడూ పూర్తిగా కూలిపోయి బొత్తిగా ఆధారంలేకుండాపోయిన కుటుంబాలు వున్నాయి—వాళ్లతో పోలిస్తే మనకి కలిగిన నష్టం తక్కువే అనుకోవాలి.' అంది భర్తకి ధైర్యం చెప్తూ.

'అంతేలే మరి' అన్నాడు ముకుందం ఎటో చూస్తూ.

* * -

ప్రకాశం మొదటినెల జీతంతెచ్చి తన చేతిలో పెడుతూంటే ముకుందం మనస్సు ఏమిటోగా అయిపోయింది.

'చిన్నతనంలో చదువు చాలించుకుని బాధ్యత తెలుసుకుని ప్రవర్తిస్తున్నాడు—వీడి జీవితం నా బ్రతుకులాగే వెళ్లిపోతుందేమో...నేనేం చెయ్యగలను' అనుకున్నాడు.

ఆరోజున ఫైనల్ బియ్యేస్సీ ఆఖరిపరీక్ష వ్రాసి ఇంటికివస్తూనే 'మా కాలేజీలో ఓ డెమాన్‌స్ట్రేటరుపోస్టు ఖాళీ అవుతోంది. అది నాకు ఇప్పించమని మా ప్రిన్సిపాల్‌ని అడిగాను—ఆయన సరే అన్నాడు—ఏవో ఫార్మాలిటీస్ కొన్ని వుంటాయనుకో—అయినా ఏమీ ఇబ్బంది వుండదుట—నేను పరీక్ష ప్యాసుకావటం ఎంత నిశ్చయమో నాకు వుద్యోగం రావటం కూడ అంత గ్యారంటీగాను నిర్ణయం అయిపోయింది.' అని ప్రకాశం చెప్తుంటే సుభద్రమ్మగారూ, ముకుందం కూడ విస్మయంగా వింటూవుండిపోయారే కాని ఏమీ అనలేకపోయారు.

'ఇంటి పరిస్థితి అర్థంచేసుకున్నాడు, ఒకరు చెప్పక్కర్లేకుండానే—ఎమ్మెస్సీ చదువుతాను అదీ ఇదీ అని వుబలాటపడలేదు.' అని ఇద్దరికీ సంతోషంకూడ కలిగింది.

'చన్నీళ్లకి వేన్నీళ్లలా వీడి సంపాదన కూడ వుంటే ఇంక అట్టే ఇబ్బంది లేకుండా హాయిగానే రోజులు గడిచిపోతాయి' అనిపించింది.

ప్రకాశం వుద్యోగంలో చేరి ఆరునెలలు అయింది. ఆవాళ కాలేజీ వదలగానే తిన్నగా యింటికి వెళ్ల బుద్ధికాక, ఓ గమ్యం అంటూ లేనివాడిలా వూరంతా తిరిగి తిరిగి చీకటిపడేవేళకి అలసటగా నిస్పృహగా ఇల్లు చేరుకున్నాడు. అతని మనస్సు కుతకుత వుడికిపోతోంది—ఎంత మరిచిపోవాలని ప్రయత్నించినా మధ్యాహ్నం జరిగింది అలా కళ్లకి కట్టినట్లుగానే వుంది......అసలు విద్యార్థులలో చాలామందికి తనంటే ఎలాంటి గౌరవంలేదని అతనికీ తెలుసు—నిన్న మొన్నటిదాకా ఇదే కాలేజీలో అతనూ తమలాంటి ఓ విద్యార్థే అనే భావంతో కాస్త లోకువగా చూసేవారు

'కుర్రమేష్టరు' అనే నిక్‌నేమ్ తగిలించి తననిగురించి హేళనగా వాళ్ళు మాట్లాడుకుంటూ వుంటారనే విషయం కూడ అతనికి తెలుసు—దానికి కారణం కొంతవరకు తనే అనికూడ అతనికి అనిపించేది. అసలు తన విద్యార్థులగుంపుని అందులో ఇంచుమించు తన వయస్సులో వుండే విద్యార్థులనీ చూస్తూంటేనే అతన్ని

# మామూలు జలుబు కొంతమంది జనులకు త్వరగా వస్తుంది. కొందరికి రాదు. ఎందువలన?



జలుబుచేయడానికి, ఆకలి లేకపోవడము, అలసట, చర్మము మరియు పళ్ళ జబ్బులు మొదలైన అస్వస్థతలకు విటమినులు మరియు లోహ ధాతువులు లేకపోవడము కారణము కావచ్చును మీకు విటమినులు మరియు లోహ ధాతువులు క్రమంగా లభించుటకు ప్రతిరోజు ఒక విమ్‌గ్రాన్‌ను వేసుకోండి విమ్‌గ్రాన్‌లో 11 ముఖ్యమైన విటమినులు మరియు 8 ముఖ్యమైన లోహ ధాతువులు ఉన్నాయి. కనుక దానితో ఆరోగ్యము, బలము, శక్తి మరియు బలమైన రోగనిరోధక శక్తి కలుగుతాయి.

## విమ్‌గ్రాన్®

మల్టిపుల్ విటమిన్స్-మినరల్స్ టేబ్లెట్లు






ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది.

SQUIBB® SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నము. దీని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi SC 4A/69 TEL

కేమిటో వణుకు పుట్టుకు వచ్చేది—మనిషికి స్వతహాగా తెలివితేటలు వుండటం, ఫస్టుగా పరీక్షలు ప్యాసవటం ఒక ఎత్తూ, తనకి తెలిసింది ఇంకొకరికి అర్ధం అయేలా చెప్పగలగటం మరొక ఎత్తూనూ—అసలు ఈ టీచింగులైనుకి పనికిరాను అనుకున్నాడు—మొగపిల్లలు అల్లరిచెయ్యటం సరే. కొంతమంది ఆడపిల్లలు కూడ మరీ అంత బరితెగించినట్లుగా ప్రవర్తించటం అతనికేమిటో ఎబ్బెట్టుగా వుండేది. వాళ్ల వేషభాషలు సరే, లేబరేటరీలోకి వచ్చినవాళ్లు కనీసం ఏపరేటస్ వంకయినా చూడకుండా ఖబుర్లు చెప్పుకుంటూ నిలబడిపోయేవారు.

'మీరింకా ప్రారంభించలేదేం' అన్నట్లు వాళ్ల దగ్గరికి వెళ్లి అడగబోయేసరికి 'ఈ ఎక్స్పెరిమెంటు అస్సలు అర్ధం కావటంలేదు—ఎలా చెయ్యాలో' అంటూ గారాలు పోయేవారు—పోనీ నిజంగా తెలియనిదేమో కొస్త అర్ధం అయేలా చెప్దాం అని కొంచెం కలుగజేసుకునేసరికి వాళ్లు గువ్వ పిట్టల్లా అవీ ఇవీ అడుగుతూ ఇంచుమించు ఆ ఎక్స్పెరిమెంటు అంతా అతనిచేతే చేయించి చివరికి రీడింగ్సు తీసుకుని సంతకం పెట్టించుకునేవారు—అంత చేసినా కృతజ్ఞత అనేది లేకుండా అతని మొహం వెనకనే గుసగుసలు పోతూ నవ్వుకునేవారు—ఛ ఏమిటీ ఖర్మ అని ఎన్నోసార్లు అనిపించినా చూస్తూ చూస్తూ వున్న వుద్యోగం వదులుకోటానికి అతనికి మనస్కరించలేదు—కనీసం ఇంకోటి దొరికేదాకానయినా అందులోనే వుండాలని నిశ్చయించుకున్నాడు—తనని వాళ్లు ఎంత లెఖ్ఖ చెయ్యకపోయినా మరీ అంతగా అవమానిస్తారని మాత్రం అనుకోలేకపోయాడు ఇంతవరకూ...

ఆవాళ మధ్యాహ్నం రాఘవరావు సుదర్శనం కలిసి ఓ ఎక్స్పెరిమెంటుచేస్తూంటే చూస్తూ ప్రక్కనే నిలబడ్డాడు ప్రకాశం. వాళ్లు అతనిని గమనించి కూడ చూడనట్లు నిర్లక్ష్యంగా వాళ్లల్లో వాళ్లు కబుర్లు చెప్పుకుంటూ రీడింగ్సు తీసుకుంటున్నారు—సరే వాళ్లకేమీ అనుమానాలు రాలేదేమో అనుకుంటూ ఒక్క అడుగు ముందుకు వెళ్లబోయాడు.

అంతలోనే భళ్లుమన్న చప్పుడు వినిపించి మళ్లీ వెనక్కి తిరిగాడు 'కొన్ని టెస్టు ట్యూబులూ అవీ క్రిందపడి పగిలిపోయి గాజు ముక్కలు చెల్లాచెదురుగా పడివున్నాయి — అలాంటి సంఘటనలు కాలేజీల్లో కొత్త ఏమీ కాదు. చదువు ముగించేలోపునే చాలామంది విద్యార్థులు ఇలా ఒకటో రెండో పగలగొట్టడం, ముందుగా వాళ్లదగ్గర తీసుకున్న డిపాజిట్‌లోంచి ఆ పగిలిపోయినవాటి విలువ కాలేజీ వాళ్లు మినహాయించుకుని మిగిలినదే వాళ్లకి ఇవ్వడం సర్వసాధారణంగా జరిగేదే. ప్యూన్ వచ్చి ఆ గాజుపెంకులు అవి తీసి అక్కడ శుభ్రం చేస్తూంటే, 'అసలిది ఎలా జరిగింది?' అన్నట్లు ప్రకాశం వాళ్ల మొహాల్లోకి చూశాడు—రాఘవరావు సుదర్శనం ఒక్కసారి మొహాలు చూసుకున్నారు

'మాకూ ఆశ్చర్యంగానే వుంది సార్—మేము అంతా ముగించేసి వూరికే నిలబడ్డాం — మీరు ప్రక్కనుంచి వెళ్లిపోతూంటే మీ చెయ్యి తగిలిందనుకుంటాను' అన్నాడు రాఘవరావు.

'అనుకోటం ఏమిటి నేను చూశాను' అన్నాడు సుదర్శనం ఎంత మాత్రం తొణక్కుండా.

విభ్రాంతితో ఒక్క క్షణం నోట మాట రానివాడిలా నిలబడిపోయాడు ప్రకాశం. 'ఏమిటి వీళ్ల ధైర్యం — నిర్లక్ష్యంగా సొమ్ము పాడుచేసిందే కాకుండా ఆ తప్పు నామీదే రుద్దాలని చూస్తున్నారా.'

'అసలు నేను ఎక్కడ నిలబడ్డాను. అవి ఎక్కడ వున్నాయి—నా చెయ్యి తగలటానికి అవకాశం ఎక్కడ వుంది.' అని వాళ్లని అడగాలనిపించింది—కాని అప్పటికే మిగతా విద్యార్థులు అక్కడ గుమిగూడటంతో ఇంక ఏమీ వాదించాలనిపించలేదు — పగిలిపోయిన వస్తువులు ఏమిటో రిజిస్టరులో నోట్ చేసుకుని వచ్చేశాడు.

'నా నోటిలోంచి అసలు మాటే రాలేదేమిటి—ఇందులో నా దోష్యం ఏమీ లేదు. తప్పంతా మీదే అని ఎందుకు నిరూపించలేకపోయాను—మరీ ఇంత మెత్తగా వుంటూ ఎన్నాళ్లు వీళ్ల మధ్య వుద్యోగం చెయ్యగలను' అని తనని తనే విమర్శించుకుంటూ అలా అలా తిరుగుతున్న ప్రకాశానికి బజారులో శ్రీపతి కనిపించాడు.

ప్రకాశం అంటే కాస్త గౌరవం అభిమానంవున్న కొద్దిమంది విద్యార్థులలోనూ అతనొకడు—అతన్ని చూడగానే పుట్టెడు దుఃఖం ముంచుకు వచ్చినట్లయింది ప్రకా



తానికి. తన అప్రయోజకత్వమూ అసహాయత్వమూ వీళ్ళందరి ముందూ బయట పడిపోయాయి కదా అనే అవమానభారంతో అతన్ని పలకరించటానికే మనస్కరించలేదు—కాని శ్రీపతే పలకరించి కాస్సేపు అవీ ఇవీ మాట్లాడి చివరికి మెల్లిగా అన్నాడు. 'మధ్యాహ్నం ఆ రాఘవరావు కావాలనే అలా అన్నాడేమో ననిపిస్తోంది సార్.'

'వాళ్ళిద్దరిలో ఎవరివల్ల జరిగిందో నాకు తెలియదు కాని నా చెయ్యి తగలలేదని మాత్రం నాకు బాగా తెలుసు.' అన్నాడు ప్రకాశం.

'రాఘవరావు మొన్నోనాడు లైబ్రరీలో కూడ ఇలాగే చేశాడు. అక్కడ్నించి, ఏదో పుస్తకం తీసుకువెళ్ళాడట—మరి నిర్లక్ష్యంగా దాన్ని ఎక్కడ పడేశాడో ఏమో పేజీలు చాలాభాగం చిరిగిపోయివున్నాయిట. ఏమీ తెలియనట్లు తెచ్చి లైబ్రరీలో పెట్టేస్తుంటే లైబ్రేరియన్ చూసి అడిగేడుట—నాకేం తెలియదు నేను తీసుకునేసరికే ఇలా వుంది అని దబాయించాడుట—కాస్సేపు దెబ్బలాడి చివరికి చేసేదేం లేక ఆ లైబ్రేరియన్ మాట్లాడక వూరుకున్నాడుట ఇతనికి జడిసిపోయి—మేమంతా మా ధోరణిలో మేం వున్నాం మధ్యాహ్నం—కళ్ళతో అయితే చూడలేదు కాని అది రాఘవరావు పనే అయివుంటుందని మాలో చాలామందికి తెలుసు-కాని ఆ మాటపైకి అనే ధైర్యం మాత్రం మా కెవరికీ లేకపోయింది.' అన్నాడు శ్రీపతి కాస్త చిన్నబుచ్చుకుని.

'మీకే "అని ఏమిటి నా కుమాత్రం వుందా ఆ ధైర్యం—అదీ కొంత నయమే—నేను అనదలుచుకున్న రెండు మాటలూ అన్నానుకాదు—ఆ లైబ్రేరియన్‌లాగ నువ్వు అంటే నువ్వు అని పోట్లాడుకోటం తప్ప మరో ప్రయోజనం వుండేది కాదు.' అని లోలోపల అనుకుని

'అంతేలే— పోరుగలవాళ్ళదే రాజ్యం ఈ రోజుల్లో— భయంతోనో భక్తితోనో మనలాంటి వాళ్ళం అందరం వాళ్ళతో ఏజోక్యం కలిపించుకోలేం—ఏదో అయిపోయిందిలే.' అన్నాడు...

రాత్రి ఎనిమిది గంటలకి షాపునుంచి ఇంటికి వచ్చిన ముకుందం; టేబిలుమీద ఆన్చుకున్న చేతులలో తల వాల్చుకుని కుర్చీలో కూర్చున్న తమ్ముడిని చూస్తూ 'అలా వున్నావేం.' అన్నాడు.

'మరెలా వుండమంటావు — కోరుకున్న చదువు చదవనూ లేకపోయాను, చేస్తున్న వుద్యోగంలో రాణింపూ లేకపోతోంది.' అని అన్నగారితో అంతా చెప్పి తన మనస్సులో బాధ కొంతయినా తీర్చుకోవాలనిపించింది.

'ఇప్పటికే అన్నయ్య బోలెడు సమస్యలతో సతమత మవుతున్నాడు—ఈ గొడవలు

కూడ చెప్పి తన మనస్సు మరీ చికాకు పెట్టటం ఎందుకు—అయినా తనుమాత్రం ఏం చేస్తాడు—ఎలాగో ఇంకో వుద్యోగం వెతుక్కుని వెళ్ళిపోవాలి—ఈ వూరు కాక పోతే మరోవూరు-ఇంక గట్టిగా ప్రయత్నాలు చెయ్యాలి.' అనుకుంటూ,

'అబ్బె ఏం లేదు—కాస్త తలనొప్పిగా వుంది.' అన్నాడు కణతలు ఒత్తుకుంటూ.

రోజులు గడిచిపోతున్నాయి — అసలే నెమ్మదిగా అమాయకంగా వుండే ప్రకాశం మరీ ఉదాసీనంగా మారిపోతున్నాడు. అతనిలో వుత్సాహం అన్నది ఏకోశానా లేకుండా పోతోంది. అతని వైఖరి ముకుందం సుభద్రమ్మగారూ కూడ కని పెట్టారు.

చివరికి మరి వుండబట్టలేక ఓ రోజు ఆవిడ కూతుర్ని అడిగింది 'కాలేజీలో గొడవేమయినా అయిందా.' అంటూ — గొడవలసంగతి ఆ పిల్లకి తెలియదుకాని కాలేజిలో అతనికి పెద్ద ఎప్రీసియేషన్ లేదనీ ఏహో నిక్‌నేమ్సుతో ఏడిపిస్తుంటారనీ తెలుసు-కాస్సేపు తటపటాయించి ఆమాటే తల్లితో చెప్పింది—అహా అనుకుంది ఆవిడ.

ఓసారి ముకుందం స్నేహితుడెవరో మాట్లాడుతూ.

'మీవాడికి బొత్తిగా చిన్నతనం — స్టూడెంట్సుని అదుపులో పెట్టటం చేత కాదు.' అన్నాడు—

## ఆశలూ— అనుభవాలూ

'సరే చిక్కు విడిపోయింది.' అను కున్నాడు ముకుందం— తమ్ముడికి ఎలా ధైర్యం చెప్పాలా అని అనుకుంటున్న సమయంలో సుందరం దగ్గరనుంచి వుత్తరం వచ్చింది త్వరలోనే తను తిరిగి వస్తున్నట్టు.

ఆ వార్త విని అందరికంటే ఎక్కువగా సంతోషించినవాడు ప్రకాశం. 'ఉద్యోగాలు సంపాదించుకోటం కూడ ఓ టెక్నిక్ —అది వాడికి కాస్త తెలుసు — నాకూ ఎక్కడో ఒకటి చూపించమని అడుగుతాను.' అన్నాడతను పొంగిపోతూ—

సుందరం ఎప్పుడు వచ్చేదీ నిర్ణయంగా తెలిశాక అంతకు నాలుగురోజుల ముందుగానే రమణిని పిల్లవాడిని పిలిపించింది సుభద్రమ్మగారు.

మూడేళ్ల రవి తల్లితో ముద్దుముద్దుగా మాట్లాడేస్తూ తామందరినీ కొత్తగా చూస్తూ దూరదూరంగా పోతూంటే సుభద్రమ్మగారికి సంతోషమూ దుఃఖమూ కూడ కలిగాయి—వాడు ఈ దేశంలోనే వుంటే ఈపాటికి ఎన్నిసార్లు వీళ్లంతా ఇక్కడికి రావటం పోవటం జరిగేది కాదు?—మొగుడు ఎక్కడో వుండటంతో ఆ పిల్ల అయిదునెలల పిల్లవాడిని తీసుకుని ఓసారి వచ్చినట్లే వచ్చి మళ్లీ వెళ్లి పుట్టింట్లోనే వుండిపోయింది—'వీడు మమ్మల్ని గుర్తే పట్టలేకుండా బొత్తిగా పరాయివాళ్లల్లె చూస్తున్నాడు' అని ఓసారి బాధపడింది— 'ఏమిటో నా చాదస్తం, పసివెధవ నాదగ్గరికే రాలేదనే అనుకుంటున్నాను కాని వాడసలు ఇంతవరకూ తండ్రిమొహమే ఎరగడు వెర్రినాగన్న' అనుకుంది మరోసారి.

సుందరం వచ్చేరోజున తెల్లవారిం దగ్గరనుంచి ఒకటే సందడి—ఎన్నడూ లేనిది సుభద్రమ్మగారు కూడ స్టేషనుకి వస్తానని ప్రయాణం అయింది.

మరిది గుమ్మంలోకి వచ్చేసరికి పారాణి నీళ్లతో ఎదురు వెళ్లటానికీ, ఇంట్లో మిగిలిపోయిన పనులు సవరించుకోటానికీ యశోద యింట్లో వుండిపోయింది.

కంపార్టుమెంటు గుమ్మం దగ్గర నిలబడి తమవంక చూసి నవ్వుతూ చేయి వూపుతున్న కొడుకుని చూస్తూనే సుభద్రమ్మగారి కళ్లు చెమర్చాయి — ఈ మూడేళ్లల్లో సుందరంలో కొద్దిగా మార్పు వచ్చింది సహజంగానే—కొద్దిగా లావయాడు—ఒళ్లు మనుపుదేలి మంచి రంగు వచ్చింది—

రైలు దిగకుండానే తల్లినీ అన్నగారినీ అందర్నీ పలకరించేడు—అతను రైలు దిగగానే జరిగిన సంఘటన మాత్రం అందరి మనస్సులనీ ఒక్కసారి కదిలించి వేసింది-ఎవ్వరిదగ్గరకీ వెళ్లకుండా తల్లి కొంగు పట్టుకుని తిరిగే రవి ఎలాంటి కొత్త లేకుండా అమాంతంగా వాలిపోయాడు తండ్రి ఆప్యాయంగా జాపిన చేతులలోకి—'ఔరా — అనుబంధాలు ఎంత చిత్రంగా వుంటాయి.' అనుకుంది సుభద్రమ్మగారు బుగ్గలు నొక్కుకుంటూ.

'ఎవరో తెలుసురా.' అంది శశి హాస్యంగా.

'మా నాన్నగారు.' తండ్రి కంఠం చుట్టూ చేతులు వేస్తూ గర్వంగా చెప్పాడు వాడు.

'నువ్వెప్పుడయినా చూశావా.' అన్నాడు ప్రకాశం పెంకిగా.

'ఓ. నాదగ్గర బోలెడు ఫోటోలు వున్నాయి.' అని వాడంటూంటే అందరూ చిన్నగా నవ్వుకున్నారు. సుందరం కొడుకు రెండు బుగ్గలూ ముద్దులు పెట్టేసు కున్నాడు—

(ఇంకా వుంది)






[కాన్‌స్టెన్‌టయిన్ ఫిట్స్ గిబ్బన్ పేరుపొందిన ఆంగ్ల రచయిత. ఈ వ్యాసంలో ఆయన నేటి నాగరిక ప్రపంచ పరిస్థితిని పరిశీలించి, అది అంధకారబంధురమయి ఉన్నదని వాదిస్తున్నారు...]

'ప్రగతి అనేది బెల్జియన్‌ల ఆలోచనలలో ఒకటి,' అన్నాడు ఫ్రెంచికవి బాదెలెయిర్ ఒకసారి. ఆయన బ్రస్సెల్స్‌లో గడిపిన కాలం అంత సంతోషంగా లేకపోవటంతో దేనినయినా తిట్టాలనుకుంటే 'బెల్జియన్' అనె విశేషణాన్ని వాడేవాడు. బెల్జియమ్‌లో పరిశ్రమల ప్రభావం ఎంతో కురూపాలని దాలిచి అతనికి అసహ్యం కలిగించేది. 19వ శతాబ్దం వాస్తవిక దృక్పథాలు కొన్ని అతనికి నచ్చేవికావు... పోనీ అప్పటికాలంలో ప్రచారంలో ఉన్న 'ఆధ్యాత్మిక భావాల ప్రగతి' అంటే ఆయనకి ఇష్టమా అంటే అదీలేదు. పార్లమెంట్లలో ప్రజాస్వామ్యంపట్ల కొందరి కృత్రిమభక్తి, క్రయిస్తవేతరులని నార్చటం, మార్క్స్ నుంచి మేరీ బేకర్ ఎడ్డీలదాకా మానవ సుఖాలని పెంచేందుకు కనిపెట్టబడిన చిట్కాలు—ఇవన్నీ అతనికి కంటకంగా ఉండేవి. జర్మన్ మేధావి నీట్‌షెలాగ తను పుట్టినకాలం అసభ్యమయినదనీ అది మరింత అసభ్యకరంగా మారుతుందనీ ఆయన నమ్మేవాడు.

అంతా నిజమేకదా? మన శతాబ్దంలో ప్రగతిగురించిన చిలకపలుకులు కావలసినన్ని. కాని, 19వ శతాబ్దంకన్నా ఏమి మెరుగు? వైద్యంలో కొంత అభివృద్ధి ఉంది నిజమే; ప్రపంచంలో కొన్ని భాగాలలో శుభ్రత పెరిగింది నిజమే; కొందరు పాశ్చాత్యవనితల జీవితాలలో కాయకష్టం తగ్గింది నిజమే; కొందరు పాశ్చాత్య కార్మికుల పరిస్థితికూడా మెరుగుపడింది నిజమే; అక్షరజ్ఞానం ఎక్కువ అయింది నిజమే; కాని సమాజంలో చీలికలు, క్షీణం అధికం అవుతున్నాయి.




కొన్ని ఉదాహరణలు ఇస్తాను: నెరూస్తాన్, ఔష్‌విట్స్, వోర్కుటా (రష్యా ఉత్తర భాగంలో నేరస్థులని ఉంచే చోటు), నీగ్రో గూడేలు, వియత్నామ్, బయాఫ్రా, నేటి మాంచెస్టర్, నిన్నటి రోండా, ప్రతి విమానాశ్రయం చుట్టూ ఉండే ప్రదేశం—అంటే ప్రతి పెద్ద ఊరి పరిసరాలూ, ఉదజనిబాంబు, జనాభా పెరుగుదల దానివల్ల రాబోయే క్షామాలు—ఇవన్నీ తలుచుకుంటేనే భయం వేస్తుంది.

మనది చీకటియుగం. సంధ్యవేళ అతివేగంగా రాత్రిగా మారిపోతోంది. పెద్దవిగా చెప్పబడే సంఘటనలు అప్రస్తుతాలు—చంద్రుడిమీద మానవుడు, గుండెల మార్పు, పాశ్చాత్యదేశాలలో విరివిగా దొరికే బూతు పుస్తకాలు, నగరాలని అసహ్యం చేసేస్తున్న మోటారుకార్లు, సిమెంటు కాంక్రీటుగా మారిపోతున్న పచ్చటి బయళ్లు, కంపుకొట్టే కృత్రిమాహారం—ఇవన్నీ...

స్పెంగ్లర్, టాయిన్‌బీలు ఏవేవో ఉదాహరణలు, సిద్ధాంతాలు చెప్పారు. అవన్నీ వల్లించ నక్కరలేదు. ఇక్కడ మనం గుర్తించవలసింది, ప్రపంచంలో చీకటియుగాలకి కొదువలేదు. తిరిగి, తిరిగి, వస్తూ ఉంటాయి అనే సత్యం. యూరప్‌లో అత్తిలాకీ షార్లమాన్‌కీ మధ్యకాలం; ఆధునిక కాలాలలో గ్రీస్‌ని టర్కీవారు పరిపాలనసేవం కింద పెట్టిన హింస ఇవి రెండూ గుర్తుకి వస్తాయి.

ఇంకా వెనక్కి పోదామా? క్నోసోస్‌ని ముందు భూకంపం బాధించింది. తర్వాత మైసినేయన్లు నాశనం చేశారు. ఈ చీకటిలోనుంచి పునర్జన్మ నొందిన మైసినేని డోరియన్ గ్రీక్‌లు తిరిగి ధ్వంసం చేశారు. మళ్లీ అంధకారం. ఇక గ్రీస్ స్వర్ణయుగంలో ఎన్ని అంతర్యుద్ధాలు? చివరికి గెలిచింది ఎవరు? మేసిడోనియాకి చెందిన కొందరు అనాగరకులు! ఈజిప్టు, మెసా




పొటేమియా, చెయినా, రష్యా, ఐర్లాండ్—అన్ని దేశాలలోనూ ఇదే కథ...

దీనికంతా కారణం బద్ధకం—బద్ధకం అంటే, నా అభిప్రాయంలో, 'ఒక సమాజంలో ఏర్పడిన వత్తిడినీ, బయటి నుంచి ఆ సమాజాన్ని బెదిరించే వత్తిడినీ అదుపులో పెట్టలేక పోవటమే'—సాధారణంగా బద్ధకం ఏర్పడిన సమాజం అంతకన్నా వెనుకబడి వున్న సమాజానికి లోబడిపోతూ వుంటుంది. ఈ రెండవ సమాజం విదేశాల నుంచి రానవసరం లేదు. పాత సమాజం నుంచి కొత్త సమాజం పుట్టుకు రావచ్చు

పాజీవీరులు, రైతు విప్లవకారులనబడే వారు, విధ్వంసకారులు, బ్లాక్ పాంథర్‌లు వగయిరాలు స్థానిక శక్తులే. అయితే ఈ విప్లవశక్తులు అధికారంలోకి రాగానే పాత అధికారుల త్రోవలనే అనుసరిస్తాయి...

ఈ శతాబ్దంలో సమాజాన్నే మార్చి పారవెయ్యాలని ప్రయత్నించినవారిలో పెద్దలు—జర్మన్ నాజీలు, రష్యన్ కమ్యూ

## ప్రగతి ఎక్కడ?

నిస్టులూ, చైనా కమ్యూనిస్టులూ. వీరిని పోలిన చిన్న చిన్న రకంవారు అమెరికా, బ్రిటన్‌లలో కూడా తలలు ఎత్తుతూనే ఉన్నారు.

ఇదంతా సర్వనాశనానికి దారితీస్తోంది.

సందేహం లేదు. చీకటి యుగం మొదలయింది.

ఆర్థికంగానే కాకుండా, నైతికంగా కూడా సమాజం పతనం అయిపోతోంది. శాస్త్రపరిశోధన కూడా ఒకరకం ఆటగా మారిపోతోంది.

రాతియుగంలో మానవుడి పనిముట్లు క్రమంగా చిన్న చిన్నవిగా మారిపోయాయి. చివరికి పనికిరాకుండా పోయాయి. నేటి ఎపోలో—11, కాన్‌కార్డ్ విమానం (శబ్దంకన్నా వేగంగా వెళ్ళగలిగిన పాసింజర్ విమానం) ఈ రకంవే...

మన చిత్రకళ, సాహిత్యంకూడా ఇలాగే మారిపోతున్నాయి.

నా అభిప్రాయంలో ఆధునిక అంధకారయుగం 18వ శతాబ్దం మధ్యలో మొదలయింది. అప్పటినుంచీ చీకటి ఎక్కువ అవుతూ వచ్చిందే కాని తగ్గలేదు. కళాకారుడి చైతన్యంలో మార్పు అతని వ్యక్తిత్వాన్ని మార్చి, కళాస్వరూపంలో బయటపడిపోతూ ఉంటుంది. కాల్పనికవాదుల కళాసృష్టి వారి అహంకారానికి నిదర్శనం. కాల్పనికవాదం చీకటియుగానికి నాంది పలికింది. (రష్యాలో కాల్పనికవాదాన్ని ప్రభుత్వంవారు అణచి వేసినా అది తల యెత్తుతూనే ఉంది)

చీకటిలో వెలుగు ఎప్పుడు? ఇంతకు ముందు ఒక్కొక్క చీకటియుగం సుమారు 400—500 సంవత్సరాలు సాగేవి. మన అంధకారయుగం మొదలయి రెండు శతాబ్దాలయినప్పటికీ ఇంకా దాని మధ్య కాలాన్ని చేరుకోలేదనే అనుమానం కలుగక మానదు. అణ్వస్త్ర యుద్ధం మొదలయినప్పుడు మధ్యకాలం వచ్చిందనుకోవాలేమో...

మరి నాశనం తర్వాత పునర్జన్మ అంటూ ఉంటుందా? ఈజిప్టు, పెరూల నాగరకతలు తిరిగి చిగురించలేదు. పాశ్చాత్య నాగరకత కొంతకాలం నిద్రాణ స్థితిలో ఉండి తిరిగి మేల్కుంది. పాతుకుపోయిన గింజ మొక్క అయి పువ్వు పూసింది. భగవంతుడిమీద నమ్మకం ఉన్నవారందరూ— 'మన పిల్లలు, వారి పిల్లలు, వారికి పుట్టబోయేవారు ఈ అద్భుతాన్ని చూసేట్టు చెయ్యతండ్రీ!' అని ప్రార్థించాలి.

కాన్‌స్టెన్‌టయిన్ ఫిట్స్ గిల్బన్

(షో. వ. కి)

# తొంగిచూసె యవ్వనం మిడిసిపడే రంగులు



మేలురకం టెరీన్/కాటన్ దుస్తుల్లో ఎంతో అందంగా కనిపిస్తారు మీరు. పొంకంగా, నలక్కుండా వుండే యీ దుస్తులలో మెత్తని, సుతిమెత్తనిదనాన్ని అనుభవించండి. వన్నెల చిన్నెలతో, మిడిసిపడే రంగులలో...పాప్లిన్‌లో రంగుకి సరిపడే చూడీదార్ పైజమాతోనో, లేకపోతే రెండూ బై రెండు కమీజుతోనో వాడండి. ముచ్చటైన అరవై రంగుల్లో! కావలసిన గళ్ళు, చారలు, చుక్కలు, ప్రింట్లు, సాదా రంగులు, యింకా యింకా.

**TATA** *Textiles* టాటా టెక్స్‌టైల్స్ **వారి ప్రింట్లు**

# ఆచూకీ తెలియని అమ్మాయి శవం!

సెప్టెంబరు 5 వ తేదిన ఢిల్లీలోని పంజాబీ బాగ్ మోరీ లోంచి ఒక అమ్మాయి శవం బయటకు తీశారు. శవం గుర్తుపట్టలేనంత భయంకరంగా వుంది. హంతకులు ఆమె ముఖాన్ని కత్తితో తూట్లు పొడిచారు. ముందు వరస పళ్ళన్నీ రాలగొట్టేశారు. కనుబొమ్మలు గొరిగేశారు, ఎడమ భాగం చెవి, బుగ్గ కోసి పారేశారు. ఈ అమ్మాయి ఎవరి తాలూకా అనే అనుమానం వచ్చింది. జూలై 6 వ తేదీ నుంచి తమ కూతురు కనబడటం లేదని బాధపడిపోతున్నా బక్షి దంపతులు ఆ శవాన్ని చూశారు. ఈమె నా కూతురు మధు.. ముమ్మూర్తులా నా కూతురే అని బక్షి భార్య నిరూపించింది. ఈ విషయం ప్రధాని వరకూ వెళ్ళింది. ఆరాలు తీయమని ప్రధాని సెక్రటరీని—సెక్రటరీ ఆ శాఖని కోరారు. ఇన్‌స్పెక్టర్ కె. యల్. సిగల్ మరికొంత మంది బలగంతో కలసి గ్రామాలు బస్తీల్లో వేట సాగించారు. 32/41 వెస్ట్ పటేల్‌నగర్‌లో ఇద్దరు నూతన వధూవరుల ఫోటో చూసి ఆగారు. చనిపోయిందనుకున్న మధు అక్కడ హాయిగా వుంది. సజీవంగా వుండడమే కాక, సలక్షణంగా పసుపు కుంకుమలతో, తల్లి

# ఒకవారం విపరీతం

(16వ పేజీ తరువాయి)

దండ్రులకు తెలియకుండా వివాహం చేసుకున్న భర్తతో సహా అక్కడ వుంది. ఆమె తల్లిదండ్రులను ఇన్‌స్పెక్టర్ తీసుకు వచ్చి 'ఈ అమ్మాయేనా? పోల్చుకోండి.' అన్నాడు. 'హా.. మా అమ్మాయి మధు..' అన్నారు వాళ్ళు.

ఉమదేపాల్‌శర్మ అనే యువకుడు వారింటికి కొన్నాళ్ళ అవతల వుంటూ, మధుతో స్నేహం చేసి, ప్రేమించి, ప్రేమింప చేసుకుని, జూలై 6 వ తేదిన ఆమెను లేవదీసుకుపోయి 9 వ తేదిన వివాహం చేసుకున్నాడట. మధు తల్లిదండ్రుల కథనం ప్రకారం కనుక 16 ఏళ్ళు నిండనిదైతే ఆమెను లేవదీసుకుపోయినందుకు ఉమదేపాల్‌శర్మ మీద కేసు వుంటుంది. కాని ఆమె కథనం ప్రకారం 18 ఏళ్ళు నిండి వుంటే ఆ జంటను ఎవరూ ఏమీ చెయ్యలేరు.

'నాన్నా/ (శ్రీ) అమ్మా: మీకు నా పెళ్ళి భారం కలిగించను. నా జీవితేశ్వరుణ్ణి ఎన్నుకుని, నేను వెళ్ళిపోతున్నాను, నా కోసం వెతక్కండి.' అని తల్లిదండ్రులకు కనీసం ఓ చిన్నఉత్తరం ముక్కయినా రాయకుండా గుండె నిబ్బరంతో వెళ్ళిపోయిన ఈ 16 లేక 18 ఏళ్ళ మధు ప్రేమికుల చరిత్రలో ఓ నూతన పంథాను చూపించింది.

ఇంతకీ ఆ మోరిలో శవం ఎవరు?

# వేడుకల్లో వింత!

మహారాష్ట్రనికి చెందిన షోలాపూర్‌లోని పొండి అనే గ్రామంలో 'అశ్వని పూర్ణిమ రోజు' అనే పండుగ చేసుకుంటారట. ఆ పండగ ఈ యేడు సెప్టెంబరు 25 న వచ్చిందట. ఈ పండుగ వేడుకల్లో ఒక వింత వుంది. పన్నెండు ఎడ్ల బళ్లను ఒకదానికి ఒకటి తాళ్ళతో గట్టిగా కట్టారట. ఆ రోజున యీ బళ్ళ మీద అరవై మంది ఎక్కుతారట. వూరిలో జగదాంబ భక్తుడైన ఒకవ్యక్తి ధ్యానంతో జగదాంబని పూజించి, యీ బళ్ళన్నిటినీ ఒక్కడే లాగుతాడట. ముందు తాపీగా, అనక బహువేగంగా యితను యీ బళ్ళను ఒక ఫర్లాంగు దూరం లాగుతాడట. మధ్య మధ్యలో ఆగి, అతను జగదాంబ పూజ చేస్తుంటాడట. మామూలుగా యీ బరువు లాగడానికి సుమారు 24 ఎడ్లను వుపయోగించాల్సి వుంటూందట. ఈ వింతను చూడడానికి దేశంలో అన్నిమూలల నుంచీ పొండికి జనం తండోపతండాలుగా వస్తారట.

—ఫాలాక్షుడు

[illegible]
[illegible] జరుగుతున్నట్లుగా ఒక ఫిల్ములో చూపిస్తున్నారనుకో. ఆ సభకు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు అందరూ వచ్చినట్లుగా చూపించవచ్చును.

'హిందువులు పెద్దవాళ్లుగాను మహమ్మదీయులు, క్రైస్తవులు మంచివాళ్లుగాను చిత్రించే దృశ్యాలు యేవీ ఫిల్ములో ఉండకూడదు. అలాగే హిందువులు అసమర్థులుగాను మిగిలిన మతాలవారు సమర్థులు

# ముగ్గురు మూర్ఖులు

(10-వ పేజీ తరువాయి)

గాను చిత్రించే దృశ్యాలుకూడా ఫిల్ములో ఉండకూడదు. ఉదాహరణకు హిందువులు తప్పుదారులను పట్టి చెడిపోతున్నట్లుగాను వారిని యే క్రైస్తవమత ప్రచారకుడో సంస్కరించినట్లుగాను చూపించకూడదు. ఆ సంస్కరణకూడా హిందూమతప్రాముఖ్యంవల్లనే జరిగినట్లుగా చూపించాలి. అలాగే హిందువును ఉద్ధరించడానికి యే క్రైస్తవుడో త్యాగం చేసినట్లుగా చూపించకూడదు. ఆ త్యాగంచేసిన ఆసామీ కూడా హిందువే అయివుండాలి.

అలాగ కాకుండా క్రైస్తవమతప్రచారకులు హిందువులను సంస్కరించినట్లుగా చూపించడం హిందువుల అసమర్థతను రుజువు చేయడంలేదా? అది హిందూ మతానికే అవమానం కాదా?

ఇక్కడ మరొక విషయాన్నికూడా ఆలోచించాలి. 'అన్నిమతాలు సమానమే'నని హిందువుల్లో చాలామంది అంటుంటారు కాబట్టి, హిందువులను క్రైస్తవమత ప్రచారకులు సంస్కరించినట్లుగా చూపించవచ్చునని మనం వాదంకోసం అంగీకరిద్దాం. ఆ పరిస్థితిలో క్రైస్తవులను హిందూ మతగురువులు సంస్కరించినట్లుగాను లేక పోతే మహమ్మదీయులను క్రైస్తవులో హిందువులో సంస్కరించినట్లుగాను చూపించే సాహసం నిర్మాతలకు ఉందా? అటువంటి దృశ్యాలు ఉన్న చిత్రాన్ని సెన్సారుబోర్డు ఆమోదిస్తుందా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'నువ్వు చెప్పినట్లుగా హిందువులకు అవమానకరమైన దృశ్యాలను సెన్సారుబోర్డు వారే తీసివేస్తే సమస్యే లేదు. అలాకాకుండా అటువంటి దృశ్యాలను సెన్సారుబోర్డు వారు ఆమోదిస్తే యేం చెయ్యాలి?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'హిందువులకు అవమానాన్ని కలిగించే దృశ్యాలను తొలగించాలని కోరుతూ హిందువులు సెన్సారుబోర్డుకు ప్రభుత్వానికి ఉత్తరాలు రాయాలి. టెలిగ్రాములు పంపాలి. అప్పటికీ సెన్సారుబోర్డు యే చర్యా తీసికొనకపోతే అటువంటి ఫిల్ముకు యెవరూ వెళ్లకుండా సదరు ఫిల్మును ప్రదర్శిస్తున్న సినిమా థియేటర్లను శాంతి యుతంగా పికెటింగ్ చేయాలి. ఈ విషయంలో సినిమా ప్రేక్షకసంఘాలు తగినంత శ్రద్ధను తీసికోవాలి. హిందువులకు అవమానాన్ని కలిగించే దృశ్యాలను తొలగించే లాగునచేయడం హిందువులందరికీ పవిత్ర కర్తవ్యం' అన్నాడు చూడామణి.

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ ఆతన్ని అనుసరించారు.

[illegible]

మీ చిట్టి (మీ భార్య) బాగా అంటే లతా మంగేష్కర్‌లా పాడతారని ఒకానొక పత్రికలో వ్రాయగా చూశాం. అయితే పిక్చర్‌లో పాటలు ఎందుకు యివ్వరు? అవకాశం రాలేదా? లేక మీకు యిష్టం లేదా?

చిట్టి కాదు... అమ్మలూ! బాగా పాడేవారే. పిక్చరులో పాడితే నా దగ్గర పాడడానికి కష్టంకదా! అందుకనే ఆవిడ పిక్చర్స్‌లో పాడటం లేదు.

పైలా చలపతి, కడప.

ప్రేమ కొందరు జ్యోతిలాంటిదనియు, మరికొందరు గుడ్డిదని అంటారుగా. ఇంతకు ఏది నిజమో తెలుపుతారా?

ప్రేమ ఫలించిన పిదప జ్యోతి లాంటిదంటారు; లేకపోతే గుడ్డిదంటారు; ప్రపంచమే గుడ్డిగా వుంది.

డబ్బుతో కొనలేనిది ఏది?

'డబ్బు'

డి. అశోకకుమార్‌రెడ్డి, బాలిరెడ్డిపాలెం.

సార్, మీ ఫియట్ కారు నంబరు ఏంటండీ? సినీఫీల్డులో క్యాడిలాక్ MSY 2175 నంబరుగల కారు ఎవరిదండీ?

నా కారు నంబరు MSY 9838; మీరడిగిన కారు శ్రీ ఎన్. టి. రామారావు గారిది.

బి. సంగీతారావు, నందికొట్కూరు.

మగవాళ్ళను చూసేసరికి ఆడవాళ్ళు పలువిధములయిన నడకలు చూపిస్తారు. కారణం?

భూమికి ఆకర్షణశక్తి తగ్గుతుంది అందుకనే అందరూ చంద్రమండలం వరకూ వెళ్ళిపోతున్నారు మగవారు కూడా ఆడవారికి దూరమైపోతారని భయం.

వక్కమునిరాజా, వక్కవారిపాలెం.

మీరు మొదట హాస్యనటుడిగా నటించిన చిత్రమేది? ఆ చిత్రములో హాస్యనటీమణి ఎవరు?

'తోటలో పిల్ల కోటలో రాణి', వాణిశ్రీ.



# రాజ్‌బాబు

ఎ. రాజగోపాలరావు, రెలిగావరంపేట

మీరు నటించిన బంగారుపిచిక చిత్రం పేపరు ఎడ్వర్టైజ్‌మెంటులో తలక్రిందులుగా, యిందులో రాజబాబు కూడా వున్నాడు అని వ్రాసారు. ఆ మాటలో ప్రత్యేకత?

నిర్మాత నాకు డబ్బు పూర్తిగా పే చెయ్యాబట్టి–అంతకంటె ఏం లేదు.

క్రొత్తివ వెంకటరమణ, అనకాపల్లి

మీరు చిత్రరంగంలో సాధించినదేమిటి? సాధించ దలచుకున్నదేమిటి? మీరు సొంతంగా చిత్రసంస్థను స్థాపించి ఒక చిత్రాన్ని డైరెక్టు చేస్తే చూడాలని వుంది. బ్రదర్ ఏమంటావ్?

ఇప్పటివరకు ఏమీ సాధించలేదు. సాధించాలని వుంది. నేను డైరెక్టరునయి, నిర్మాతనయితే చూడాలని వుంది అంటున్నావ్. ఎలా? మీవూరి రోడ్లోనా? లేక సినీ...

బి. అప్పారావు, కంచరపాలెం

మీరు, నేను చంద్రమండలం వెళ్ళామనుకోండి అప్పుడు చంద్రగ్రహణం వచ్చిందనుకోండి. రాహువు చంద్రుని మింగితే మనం ఏమవుతాము సార్?

వెళ్ళినప్పటికన్నా మనం ఎలాంటి వాళ్ళం? రాహువునే మింగగలం నాన్.

మీరు ఎంతవరకు చదువుకున్నారు? మీరు చిత్రరంగంలో సాధించిన ఘనత యేమి?

ఎస్.ఎస్.ఎల్.సి; సెకండరీ ట్రైనింగ్. సాధిస్తే చెబుతా. యింకా లేదు.

టి. రమేష్, కొల్లాపురం

నేను మిమ్మల్ని చూసినప్పుడంతా మానవుడు మొదట...అంటు మొదలిడే చరిత్ర జ్ఞప్తికొస్తుంటుంది? ఎందుకో చెప్పుకోండి చూదాం?

ఆ రహస్యం నీకు, నాకు తెలుసు కాబట్టి–నీవు ఎంత చిన్న "టకోవి" తమ్ముడూ–

కె. రాజారావు, యలమంచిలి

మీ రెప్పుడు సినిమాల్లో హాస్యంగా నటిస్తుంటారుకదా. దుఃఖమంటే మీకు భయమా?

నవ్వించేవారి సంఖ్యకంటె నవ్వుకునేవారి సంఖ్య చాలా తక్కువ. అందుకని. భయంకంటె దుఃఖమంటె యిష్టం.

---

బహుమతి పొందిన ప్రశ్న

ఎం. జయరామ, బెంగుళూరు

ఫ్యాషన్ అనే పేరుతో ఆడ మగ భేదా లేకుండా పోతున్నారుగదా! మరి స్త్రీని స్త్రీగా చూడగలిగేరోజులు ఎప్పుడొస్తాయండీ?



సరిగ్గా చూసినప్పుడు — అదే గౌరవించినప్పుడు.

# సినిమా

తెలుగు తమిళ చిత్రాల పాప్యులర్ కథానాయిక, అచిరకాలంలోనే తారాపథాన్ని అందుకున్న సినిమానాయిక అయిన కుమారి జయలలితను యింతవరకు మీరు నటిగా, నాట్యకత్తెగానే చూశారు. ఇప్పుడామె గాయకికూడా అయింది. గౌతమ్ పిక్చర్స్ నిర్మిస్తున్న 'అలీబాబా నలభై దొంగలు' చిత్రంలో తనే స్వయంగా ఒక పాటను పాడుతూంది. ఈ చిత్రానికి శ్రీ విఠలాచార్య దర్శకుడు; శ్రీ డి. వి. నరసరాజు కథకుడు; శ్రీ ఎన్. టి. రామారావు కథానాయకుడు. 1970 ఏప్రిల్‌లో ఈమె ఓవర్‌సీస్ టూర్ (విదేశ పర్యటన) చెయ్యనున్నది.

* * *



'మాతృదేవత'లో విజయలలిత.



'మెరుపు వీరుడు'లో కాంతారావు, లక్ష్మి.

హేమలత కుమారుడు శోభన్‌బాబు; అందగాడు; చురుకయినవాడు; బుద్ధిమంతుడు. ప్రభాకరరెడ్డి పర్సనల్ సెక్రటరీ కె ఆర్ విజయ. యౌవ్వనంతోవున్న విజయ, శోభన్‌లు గాఢంగా ప్రేమించుకుంటారు. పార్కుల్లో, సినిమాల్లో వీలు దొరికినప్పుడల్లా ప్రేమసౌరాలు వల్లించేవారు. ఆమెనే పెళ్లిచేసుకుంటానని మాటయిచ్చాడుకూడా.

ఒకరోజు శోభన్ పడక గదిలో దీర్ఘంగా ఆలోచిస్తూవున్న సైకిరినిచూచి వాళ్లమ్మ హేమలత 'అందరిలాగా నాకు ఆ అదృష్టంవుందో లేదో, నా తల వ్రాత ఇంతేనేమో' నంటూ రుసరుస లాడుతూ

# సినిమా

వెళ్లిపోయింది. అప్పటికే అక్కడికి వచ్చిన విజయ హేమలత మాటలను విన్నది; 'అత్తయ్య ఏమంటుంది ?' అని తన ప్రియుణ్ని ప్రశ్నించింది. 'అబ్బే మరేం లేదు. మన పెండ్లి ఇంతలేటయితే తనకు మనమడు ఇంకెంత లేటుగా పుడతాడోనని బాధపడింది. అంతే' నన్నాడు 'లేటయింది అబ్బాయికా లేక అత్తయ్యకా ?' అంది; 'దానికేంగానీ, రా నువ్విలా కూచో' అంటూ తన వొడిని చూపిస్తాడు. ఇప్పుడు కాదు. పెళ్లి అయింతర్వాత. ఇప్పటికే



'కాశికొట్టు'లో పెరుమాళ్లు, సూర్యకాంతం, కృష్ణ, సాక్షి రంగారావు.

[illegible] కూర్చుంది. 'కట్' అన్నారు దర్శకులు పి. రామచంద్రరావు ఈ సన్నివేశాన్ని వి. ఎస్ ఆర్. స్వామి మూడు యాంగిల్స్‌లో చిత్రీకరించారు పై దృశ్యాన్ని శ్రీ ఆనందమోహన్ నిర్మిస్తున్న 'మా మంచి అక్కయ్య' చిత్రంలో మీరు చూస్తారు. ఈ చిత్రానికి ఓ ఎస్. ఆర్, ఆంజనేయులు కో—డైరెక్టరయితే, కోదండపాణి సంగీత దర్శకత్వాన్ని, అనంతరావు కళాదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం రాయల ఫిలింస్‌ద్వారా డిసెంబరు ఆఖరున విడుదలవుతుంది.

* * *

'మా మంచి అక్కయ్య' సెట్లో పాల్గొన్న కె. ఆర్. విజయను 'ఇటీవల మీరు విదేశ పర్యటన చేసారుగా. ఎలావుంది ?' అని ప్రశ్నించాము. 'మా వారు స్వంత పని మీద వెళ్తూ నన్ను రమ్మన్నారు. వెళ్లొచ్చాను. ఇరవైరోజుల నా పర్యటన ఇరవైగంటల్లా అయిపోయిందేమిటి అని పించింది; ఇక్కడ కాల్‌షీట్లు ఇచ్చి నేనక్కడ కూర్చుంటే ఎలా ? అందుకే వచ్చేసాను. వచ్చినప్పట్నుండి విశ్రాంతిగా షూటింగుల్లో పాల్గొన్నాను' అంది.

* * *

ప్రక్కనేవున్న శోభన్‌బాబును 'మీ ఇల్లు కట్టడం పూర్తయిందనుకుంటా ?' అనడిగాను. 'ఇంకొంచెం పని మిగిలి వుంది. పూజ పని ప్రారంభించాలి. నవంబరు 19 న కొత్త ఇంట్లోకి శాస్త్రోక్తంగా ప్రవేశిస్తాను' అన్నారాయన.

* * *

ప్రస్తుతం శోభన్‌బాబు 'పెత్తందార్లు', 'గుణవంతుడు', 'మాతృదేవత', 'మా మంచి అక్కయ్య' 'కన్నులపండుగ' చిత్రాలలో ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. తాపీ చాణక్య దర్శకత్వంలో ఎన్ కె. వి ప్రొడక్షన్స్ నిర్మించనున్న సాంఘికంలోనూ, తారా పిక్చర్స్ నిర్మించే జానపదంలోనూ కథానాయకుడిగా నటించడానికి అంగీకరించారు.

* * *

ఎక్కువ చిత్రాలలో నటించడమన్నా ప్రాముఖ్యతలేని పాత్రలను ధరించడమన్నా నాకు ఇష్టంలేదు. నా వృత్తిపై నాకు



'శ్రీదేవి'లో కె ఆర్ విజయ, హరనాథ్

గౌరవముంది. నా కృషిపై నాకు నమ్మక ముంది. నాకు ప్రేక్షకుల అభిమానం, ఆదరం వుండనేవుంది అన్నారు శోభన్ బాబు.

*　　　*　　　*

ఎన్ టి. రామారావు, చెట్టెక్కి గొడ్డలితో కొమ్మను నరకబోతుంటే, చెయి జారిన గొడ్డలి, ప్రక్కనున్న నీటి గుంటలో పడుతుంది; ఎన్ టి. రామారావు గుంటలోకి దూకుతారు; ఆయన చేతికి మెత్తగా ఏమో తగిలింది, తీరా చూస్తే అది ఒక ముందరాంగి కాలు; ఆమెను అమాంతంగా ఎత్తి గట్టెక్కిస్తారు; ఆమె మరెవ్వరో కాదు. తన ప్రణయదేవతయే, ఇద్దరూ ప్రణయావేశంలో మన వూహకందని ప్రపంచానికి (మనసా) వెళ్ళిపోయారు. ఆ వయ్యారి మీ అభిమాన తార జయలలితే. ఈ శృంగార సన్నివేశాన్ని ఆలీబాబా

నలభై దొంగలు'కు గాను శ్రీ విఠలాచార్య, శ్రీ వేణు కెమెరా సహాయంతో వివిధ కోణాల్లో చిత్రీకరించారు. ఈ చిత్రానికి శ్రీ డి వి. నరసరాజు కథకుడు; శ్రీ ఘంటసాల సంగీత దర్శకుడు. శ్రీ రామ బ్రహ్మం నిర్మిస్తున్న యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను ఎన్. టి. రామారావు, జయలలిత, నాగభూషణం, సత్యనారాయణ, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య పోషిస్తున్నారు.

*　　　*　　　*

పండరీబాయి కుమారుడు నాగేశ్వరరావు. కెప్టెన్ గిరిచేసి యింటికి వచ్చిన నాగేశ్వరరావును చూడాలని ఆయన ప్రేయసి భారతి పరుగు పరుగున వచ్చింది. రాగానే పండరీబాయి కాళ్ళకు మ్రొక్కిందే. 'బావ ఎక్కడ, చెప్పత్తయ్యా' అని అడుగుతున్న సమయానికి అక్కినేని టిప్ టాప్‌గా ప్రత్యక్షమయ్యారు భారతిని ఎక్కడికో రమ్మని కన్ను గీటుతారు పాపం, ఆ అమ్మాయికి అర్థం కాలేదు. 'ఏమిటి బావా?' అని ప్రశ్నించింది. 'అదే, బొంబాయినుండి నువ్వు తెమ్మన్న పుస్తకాన్ని తెచ్చాను. రా, యిస్తాను' అని పిలుస్తారు 'ఓ, అదా, తెచ్చావా బావా, అయితే వస్తా'నంటూ నాగేశ్వరరావును వెంబడిస్తుంది. ఈ సంభాషణను వింటున్న నాగభూషణం 'అబ్బో. అదేం పుస్తకమో. నేను తప్పక చదవాల్సిందే' అంటూ వారిని అనుసరించబోతుంటే దర్శకుడు జీ వి.

# తెరపై "ముద్దు" కావాలా? వద్దా?

## నమస్కారం విలువ...



టి ఎల్. కాంతారావు: విదేశీ చిత్రాల్లో చప్పట్లు కొట్టే దృశ్యాలను మన చిత్రాలలో ప్రవేశ పెడితే, మన ప్రేక్షకులు తెర చింపేస్తారు మనవాళ్ళు ఎక్కువగా ప్రేమించే వస్తువును అతి పవిత్రంగా చూసుకుంటారు ఎక్కడ ఏ మచ్చ కనిపించినా చీదరిస్తారు. మన కళకు మన సంస్కృతికి గల గౌరవాన్ని విదేశాలలో యినుమడింప చేసేందుకు కృషి చెయ్యాలిగాని, వాళ్ళ అలవాట్లను మనం కాపీకొట్టడం ఆరోగ్యకరం కాదు. మనం కూడా 'ముద్దు'ను ఆదరిస్తే, మన 'నమస్కారం' యొక్క విలువ పోయినట్టే.

## పవిత్రమైనది...

ప్రఖ్యాత నిర్మాత శ్రీ డి. వి. ఎస్ రాజు "ముద్దు లేకుండానే శృంగారాన్ని ప్రెజెంట్ చెయ్యగలం. 'ముద్దు' అనేది పవిత్రమయినది. తెరపై ప్రవేశం మనకు ఆరోగ్యకరం కాదు" అని వెల్లడించారు

## మన పద్ధతులు వేరు...



కె. ఆర్. విజయ: మన సంస్కృతికి, మన ఆచారానికి వున్న గౌరవాన్ని మన చేతులారా మనం చెడుపుకుంటామా? విదేశీ వాతావరణం వేరు, మన పద్ధతులు వేరు; 'ముద్దు' మనకు నిషేధమే'

సేకరణ: శ్రీనివాస్











# సినిమా

ఆర్. శేషగిరిరావు 'కట్' అన్నారు. నాగేశ్వరరావు భారతి ఎక్కడికెళ్ళారు? ఏం చేసారు? ఆ పుస్తకాన్ని నాగభూషణం పొందగలిగారా? అనేది ప్రశ్నలకు 'సిపాయి చిన్నయ్య' చిత్రం సమాధానం యిస్తుంది. డి. రామానాయుడు నిర్మిస్తున్న ఈ చిత్రానికి భాస్కరరావు ఛాయను, రాజేంద్ర కుమార్ కళను, ఎం. ఎస్. విశ్వనాథన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. నవయుగా



'సిపాయి చిన్నయ్య'లో కె. ఆర్. విజయ, నాగేశ్వరరావు

పిక్చర్స్ విడుదల చేయనున్న ఈ చిత్రంలో ఇతర ముఖ్యపాత్రలను కె. ఆర్. విజయ, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు, ఋష్యేంద్రమణి ధరించారు. తురయూర్ మూర్తి కథకు, భమిడిపాటి సంభాషణలను సమకూర్చిన ఈ చిత్రంలో కనిపించే కలర్ దృశ్యాలను, ట్రిక్ షాట్లను ఎస్. ఎస్. లాల్ చిత్రీకరించారు.

* * *

కేశవ్యాలభామి, అలిదాలగుమ్మ; చిలిపి చూపుల చిలుక, చిన్నారిమొలక అయిన విజయలలిత హావభావరయిన తన చూపులతో ప్రతివారి మనసులో తీయనిభావాన్ని కలిగించింది; అందరూ ఆమె అందానికి దాసోహమంటున్నారు కానీ ఆమె యెవరి కోసమో యెదురుచూస్తూ వుండింది; ఆమె నోరు వుప్పట్నుండి ఒక్కసైపుగమళ్ళింది; ఆమెలో వుత్సాహం పొంగి పొరలింది ఆనందోద్రేకంలో కమ్మటిపాట యథేచ్ఛగా వచ్చేసింది తను కోరినవాడు వచ్చేసాడు; ఆ మొనగాడు మరెవ్వరో కాదు. కృష్ణే; విజయలలిత ఏం పాడిందో కూడా తెలుసు కోండి.

'కమ్మటి దాకటి దాచాను
ఇమ్మన్నది నీకు ఇస్తాను
చక్కటిదొరా మక్కువతీరా
ఉక్కిరి బిక్కిరి చేస్తాను'

ఈ పాటను ఆరుద్ర వ్రాయగా, కె వి మహదేవన్ ఎల్ ఆర్ ఈశ్వరిచేత ప్లేబ్యాక్‌గా పాడించారు. పై సన్నివేశం శ్రీపద్మావతి ఫిలింస్‌యొక్క మొదటిచిత్రానికిగను దర్శకుడు మల్లికార్జునరావు, కెమరామెన్ వి ఎస్ ఆర్. స్వామి సహకారంతో చిత్రీకరించారు.



'అగ్గిపిడుగు'లో [illegible]

పై సంస్థకు దర్శకుడే అధినేతకూడా; వీరు దర్శకత్వం వహించిన 'గూఢచారి 116' ప్రేక్షకులో కొత్త మెప్పును కలిగించింది; 'ఇప్పుడు ఎక్కువ థ్రిల్స్‌తోనూ చక్కటి సస్పెన్సుతోను భారీయెత్తున నిర్మించదలచాను' అన్నారు మల్లికార్జున

'ప్రతీకారం'లో విజయఖాను, రాజ్ బాబు

# సినిమా

రావు. ఆరుద్ర రచన సాగించిన ఈ చిత్రంలో విజయనిర్మల, కృష్ణ నాయికా నాయకులు.

* * *

విక్కలిలేని ఆగ్రహానికి, ఆవేశానికి గురి అయింది అబల శకుంతల, ఆమె యౌవ్వనపు పొంగును రాజనాల మాచారు; ఆమెను తనివితీరా పొంది, ఆమె అందాన్ని అనుభవించాలనుకున్నారు. పాపం పసిది ఏంచేయనుంది: కాలికి గజ్జెకట్టింది, ఆట పాటలతో రాజనాలను కవ్వించింది; నవ్వించింది,

'ఎవరికోసం ఈ కాలం
ఆగదోయీ ఒక్కక్షణం'

శ్రీ రాజశ్రీ పాటకు శ్రీ కోదండపాణి స్వర కల్పన చేసారు. శ్రీ కె ఎస్ ఆర్ దాస్ చిత్రీకరించారు; కన్నప్ప కెమెరాను కదలించారు.

పై పాటను విజయలక్ష్మి కన్నారావు పాడింది; ప్రప్రథమంగా పాడినా, గొంతులో సౌరస్యం, మాధుర్యం వుందనిపించింది; అవకాశాలు యిస్తే మనకు మరొక వుత్తమ గాయకి దొరికినట్లే అనిపిస్తుంది. అలాగే శకుంతల నటిస్తున్న మొదటి చిత్రం యిదే అని చెప్పినప్పుడు నేను నమ్మలేక పోయాను; దానికి కారణం ఆమె నటనా ప్రతిభయే. ఈ వ్యవహారమంతా సంజీవిని ఫిలింస్ వారి 'గండరగండడు' చిత్రానికి సంబంధించినదే. ఇప్పటికి ఈ చిత్రం 13రీళ్లు తయారైంది, మూడు ట్రిక్కుల దర్బారు దృశ్యమాత్రం మిగిలివుంది; చిత్రం నవంబరు ఆఖరున విడుదలవుతుంది. ఈ చిత్రంలో అనిత నాయికగా కాంతారావు యొక్క ప్రేయసిగా నటించడం మరో విశేషం.

* * *

రాజబాబును జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్ అనడం వుచితం; అతనికి తెలియనిదంటూ వున్నట్లు లేదు; మోటార్ మెకానిక్ అయ్యాడు. అతన్ని ఆ వూరి పోస్టుమ్యాన్ అల్లు రామలింగయ్య కూతురు సంధ్యారాణి ప్రేమించింది; ఇద్దరు పెళ్లిచేసుకుందామనుకున్నారు; కాని వాళ్లయ్య వేరే సంబంధాన్ని యేర్పాటు చేస్తూ తన కూతురు గడప దాటరాదని ఆజ్ఞాపిస్తాడు. ఆమెకు దిక్కుతోచలేదు. రాజబాబుకు ప్రేమలేఖ వ్రాసింది; ఆ జాబును అల్లు రామలింగయ్య రాజబాబుకు అందించాడు; 'నువ్వే చదివి పెట్టు బాబు' అంటాడు. రాజబాబు ప్రేమాయణంలోని సారాంశం యేమంటే; 'నిన్ను నీ ప్రియురాలు యివాళ సాయంత్రం నాలుగ్గంటలకు బీచ్ వద్దకు రమ్మంటుంది' అని చదివి వినిపిస్తాడు; 'గుర్రో నాకేదో భయంగా వుంది నువ్వు కొంచెం సాయం రా బాబూ' అని ప్రాధేయపడ్డారు. 'కట్' అన్నారు దర్శకుడు బి. ఎస్. నారా

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA




# ఆంధ్రసచిత్రవారపత్రిక

అక్టోబరు 1969

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | |